# ముఖచిత్రం



**జార్జ్ గ్రాజ్ (1878-1959)**

జార్జ్‌గ్రాజ్ దృశ్య కళాకారులలో, ఈ శతాబ్దంలో కెల్ల గొప్పవాడు. నాజీ పూర్వ జర్మనీని అత్యంత ఆటవికంగా చిత్రిస్తూ వ్యంగ్య చిత్రాలుగీశాడు. 14వ యేట పాఠశాలనుంచి బహిష్కృతుడయ్యాడు దానితో చిత్రకారుడు కావాలని నిర్ణయించుకొన్నాడు. సమాజంలో ఉన్న దుర్గుణాలను, అవినీతిని కడిగివేయాల్సిన బాధ్యత తనకుందని భావించి, పేదలను, వారిని తిట్టిన పాలక వర్గాలను తిడుతూ చిత్రించాడు

మొదటి ప్రపంచ యుద్ధానంతరం అతని కళ రాజకీయ రంగులు పులుముకొంది. వామపక్షపత్రికలలో అతడు మిలిటరీ, క్రైస్తవ మతాచార్యులు, విపరీతంగా లాభాలు గడించే పెట్టుబడిదారుల చిత్రాలను ప్రచురించాడు ఈ చిత్రాలు, అతనికి వారంటే ఉన్న కోపాన్ని, ద్వేషాన్ని వెళ్ళ గక్కుతాయి 1933లో హిట్లర్ ఛాన్సెలర్ కావడానికి పద్దెనిమిది రోజులు ముందు అమెరి: ၊ వలస వెళ్ళాడు. ఇంక కొద్ది వారాలు జర్మనీలో ఉంటే మృత్యువుని తప్పించుకొని ఉండేవాడు కాదు. తరవాత అతడు అతని మరణానికి కొద్ది రోజుల ముందే 1959లో బెర్లిన్ వచ్చాడు. అమెరికాలో అతడు ఆశించిన విజయం అతనికి మరీచికయే అయింది

**చిత్రం ప్రేమికులు**

1923లో అశ్లీల చిత్రణకు కోర్టు విచారణను ఎదుర్కొన్నాడు 1920ల్లో, ప్రేమికులలాంటి లైంగిక విమోహిక దృశ్యాలను ఎన్నింటినో చిత్రించాడు వీటన్నింటిలోను అతడు తమ రహస్య లైంగిక వాంఛలను తీర్చుకొంటున్న, బాగా కొవ్వుదిగిన పెట్టుబడిదారులను చిత్రించాడు ఇదంతా తాను వారికి బుద్ధి గరపాలనే చేస్తున్నానన్నాడు విచారణలో చిత్రించేది వికారంగా, రోతగా ఉన్నా తన ఉద్దేశాలు మంచి వేనని వాదించాడు.

# మిసిమి

**"All that we are is the product of what we have thought" is "We are what we think." — Dammapada.**


సంపుటి 10 | మే 1998 | సంచిక 5

వ్యవస్థాపక సంపాదకుడు : డాక్టర్ **రవీంద్రనాథ్ ఆలపాటి**


## విషయసూచిక






విడిప్రతి రూ. 6/- వార్షిక చందా రూ. 70/-


ముఖచిత్రం : **ప్రేమికులు**


**Printed & Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd., 1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7645536**

సంపాదకుడు : **అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి**

# QUIZ : Between the fine print

**They are an essential part of your mornings when you pore through them at the breakfast table. They give you news and views and entertainment that you couldn't do without. Find out more about the country's newspapers and magazines and how they function.**

## Questions

1. Which English daily of India did not publish the news of Mahatma Gandhi's assassination on its front page?
2. Which Bengali daily made the claim that Rabindranath Tagore was suffering from a sex disease from a very early age?
3. When Satyajit Ray was making Sadgati, based on Prem Chand's story, a Hindi daily of North India criticised him saying "Prem Chand ki sadgati ke upar durgati ki chaya". Name the Hindi daily.
4. Shobha De was once the editor of a Bombay-based film magazine. Which one?
5. Which was the first colour magazine published in India?
6. The riot that broke out in Calcutta on 16th August, 1946, is often referred to as "The great Calcutta kiling". This term was actually taken from a headline of a famous English daily. Which newspaper was it taken from?
7. How did the Amrita Bazar Patrika get its name?
8. Which newpaper says about itself: "We sell more because we tell more"?
9. From which newspaper did famous cartoonist P.K.S. Tully start his career?
10. Name the first magazine which was exclusively designed for Indian television watchers (but which has now ceased to exist).
11. Which Calcutta-based Bengali daily's logo was designed by Satyajit Ray ?
12. Which is the largest circulated English daily in Assam?
13. During the December 1992 communal riots, a newspaper in Calcutta printed, something that was considered objectionable, and hence the West Bengal Government was compelled to seize all copies of that daily. Which paper was it?
14. What did The Indian Cricketer and Sports week have in common?
15. "Readers are advised that some of the pictures published in this issue ..may cause. emotional distress to some, especially - children". Why did the Madras - based English magazine Frontline publish this cautionary note in its issue dated June 8-21, 1991?

**ANSWERS**

1. *The Hindu* (Madras). In those days only advertisements were published on its front page. 2. *Avatar.* 3. *Naba Bharat Times.* 4. *Stardust.* 5. *The Illustrated Weekly Of India* (Bombay). 6. *The Statesman* 7. The founders of this newspaper were from a village in East Bengal which was known as 'Amrita Bazar'. 8. *The Pioneer.* 9. *National Herald* (New Delhi). 10. The Bengali magazine *Television* (published from 1988 to 1994). 11. *Aajkal.* 12. *The Assam Tribune* (Guwahati) 13. The Calcutta-based Urdu daily *Azad Hind.* 14. They wer both edited by Sunil Gavaskar. 15. The issue contained some vivid pictures of the assassination of Rajiv Gandhi in gory detail.

**Somen Sengupta**

# ''ఉత్తమ రచన హృదయానుభూతులను స్పృశించాలి''

## 1950 నొబెల్ పురస్కార స్వీకారోపన్యాసం

**ఫాక్నర్ (1897-1962)** అనువాదం : మడుపల్లి సురేష్ కుమార్

నా కందినటువంటి ఈ అత్యున్నత పురస్కారం వ్యక్తిగా నాకు చెందినది కాదు. నా జీవిత కాలపు రచనలకి అందిన ప్రతిఫలంగా నేను భావిస్తున్నాను. నా ఈ రచనలు పేరు ప్రతిష్ఠలకోసమో, లాభార్జన కోసమో చేసినవి కావు. ఇవి మానవ హృదయ ఆవేదనలోనుండి, ఆక్రోశములో నుండి జనించినవి. నేను ఈ అవార్డుకు ఒక ధర్మ కర్తను మాత్రమే ఏ మానవాళి ప్రయోజనాన్ని ఆశించి ఈ పురస్కార ఫలం ఇవ్వబడిందో దానికే ఈ సొమ్ము వెచ్చింపబడగలదని ఆశిస్తున్నాను. ఆవేదనా పూరిత హృదయంతో ప్రయాసలకోర్చి మానవ ఆత్మ సంబంధములను ప్రతిబింపచేసే రచయితలకు, వారి ప్రతినిధిగా నాకు లభించిన ఈ పురస్కారం ఉత్తేజ దాయకమౌతుందని నమ్ముతూ వారిలోనే కొందరైనా నేను నిలబడినటువంటి స్థాయిని చేరి మానవ ప్రగతి కారకులౌతారని ఆశిస్తున్నాను.

ఈ రోజు మన దురదృష్టం ఏమిటంటే మనం సామాన్యమైనట్టి, భౌతిక మైనటువంటి విషయములకై ఆరాటపడుచున్నాము. మనము మన ఆత్మ చేసేటటువంటి శోధన, పరితాపము, క్షోభను గుర్తించడం లేదు. పేరు ప్రఖ్యాతుల కోసం పడే ఆరాటంలో ఒక ఉన్నత రచనకు ప్రేరణ, ప్రాణమైనటువంటి ''మానవ హృదయ సంఘర్షణ''ను మనం మన రచనలలో ప్రతిఫలించడం మర్చిపోతున్నాము.

మానవుడు మళ్ళీ తన గమ్యం మార్చుకోవాలి. తనను తాను ఛోదించుకోవాలి సంస్కరించుకోవాలి, అన్నింటికంటే ముఖ్యంగా తనను తాను తెలుసుకోవాలి తన హృదయావేదనను అర్థం చేసుకోవాలి. ప్రేమ, గౌరవం, జాలి, సానుభూతి, దర్పం, త్యాగం, ద్వేషం, ఈర్ష్య, అనురాగం వంటి ఈ మానవ హృదయానుభూతులను స్పృశించనటువంటి ఏ రచనయైనా బుద్బుధ ప్రాయమైనటువంటిది. అది అంతరించక తప్పదు.

మానవుడు పవిత్ర పేమ గురించి కాక కామము గురించి, ఎటువంటి విలువ లేని ఓటమి గురించి, ఆశయాలు లేనటువంటి విజయాల గురించి, ఎటువంటి సానుభూతి లేకుండా తన రచనలు సాగిస్తున్నాడు. మానవ హృదయానుభూతుల గురించి కాక అతని ఇంద్రియ అనుభూతుల గురించే రచనలు సాగిస్తున్నాడు. మానవుడు విశ్వమానవ మనుగడకు మూలాధారమైనటువంటి భాదలను, తత్వాన్ని తన రచనలలో స్పృశించడం లేదు. ఇలా ఎంతకాలం అతను శ్రమించినప్పటికీ అతని శ్రమ నిష్ఫలము.

ఈ విషయాలను తెలుసుకుంటే తప్ప రచయిత సామాన్య మానవుడి వలె మానవాళి అంతరించేదాకా ప్రేక్షకుడి లాగా చూస్తూ విఫలుడౌతున్నాడు. మానవజాతి అంతరించిపోతుందనే విశ్వాసాన్ని నేను అంగీకరించను. మహా ప్రళయాంతపు చివరి క్షణం వరకూ మానవుని

★ **యమ్. సురేష్ కుమార్,** వి యస్.ఆర్ & యన్.వి.ఆర్ కళాశాల, తెనాలిలో ఆంగ్లశాఖలో ఉపన్యాసకులుగా పనిచేస్తున్నారు

అలసిపోనటువంటి హీన స్వరం వినిపిస్తూనే ఉంటుంది. ప్రళయాంతం వరకూ మానవుడు చావలేక బ్రతకడం వలె కాక విజయంతో వికసిస్తూ ఒక కరదీపిక వలె ప్రకాశిస్తూ ఉంటాడు. మానవుడు అమరుడు, సాస్వతుడు ఎందుకంటే అతనికున్నటువంటి అలసట పొందని స్వరము వలన కాక అతనికున్నటు వంటి ఆత్మ భోద వలన. ఈ ఆత్మ సానుభూతి, సహనము, త్యాగము వంటి సుగుణాలతో సోభిల్లే ఒక శాశ్వత శక్తి.

రచయిత యొక్క కర్తవ్యం ఈ ఆత్మానుభూతులను వివరించడమే. ప్రేమ, త్యాగం, సహనం, సానుభూతి, ఆశ, అణుకువ, జాలి వంటి హృదయాను భూతులను నేటి మానవులలో తట్టి లేపడం వంటి బృహుత్ కార్యాన్ని సాధించడం రచయితలకు లభించునటువంటి మహత్తర అవకాశము. రచయిత రచన మానవ జీవితాన్ని చిత్రీకరించడమే కాదు అది మానవ జీవితానికి ఒక శాశ్వత ఆలంభన కావలెను.

★ ★ ★

ఒక గొప్పవ్యక్తి గొప్పతనాన్ని విదేశీయులు గుర్తించిన తర్వాతే స్వదేశీయులు ప్రస్తుతిస్తారనే నానుడికి నిదర్శనమే విలియమ్ ఫాక్నర్ జీవితం. హెమింగ్‌వే, హోతార్న్, మార్క్‌ట్వైన్, సిన్‌క్లెయిర్ లూయీస్ వంటి ప్రఖ్యాత అమెరికన్ నవలాకారుల సరసన చేర్చదగిన ప్రఖ్యాత నవలా రచయిత, బహుముఖ ప్రజ్ఞాశాలి విలియమ్ ఫాక్నర్.

ఫాక్నర్ దక్షిణ అమెరికాలోని మిస్సిస్సిపి ప్రాంతంలో 1897లో జన్మించెను. ఏ విలువల కోసమై ఇంగ్లాండ్ మరియు యూరపు నుండి ఇక్కడకు తరలి వచ్చి ఒక నూతన జాతి, మత నిర్బంధము లేని స్వేచ్ఛాయుత రాజ్యాన్ని పిలిగ్రిమ్ ఫాదర్స్ స్థాపించారో అవి ఏమీ కూడా దక్షిణ అమెరికాలో పాటింపబడలేదు ఇచ్చటి నీగ్రో మరియు తెల్లవాళ్ళ మధ్య గల జాతి వైషమ్యాలను నిశితంగా పరిశీలించి తన రచనలలో ప్రతిఫలింప చేసినాడు విలియమ్ ఫాక్నర్. ఇతని రచనల మీద దక్షిణ అమెరికన్ల భాషా ప్రభావం, ఈ ప్రాంతపు ఆచార వ్యవహారాలు, జానపద గాధల ప్రభావము కనిపిస్తుంది. ఉత్తర అమెరికన్, దక్షిణ అమెరికన్‌ల మధ్య గల వ్యత్యాస వ్యవహారాలను నిశితంగా తన రచనలలో ప్రతిఫలింపజేసాడు. దాదాపు తన రచనలన్నింటిలోనూ కథా ప్రాంతముగా, తను జన్మించిన, నివసించిన మిస్సిస్సిపీ ప్రాంతాన్నే ఒక ఊహా నగరంగా సృష్టించి దీనికే 'Yoknapatawapha' అని నామకరణం చేసి తన రచనల ద్వారా ఈ ఊహా కల్పిత ప్రాంతాన్ని అమరము చేసినాడు.

ఫాక్నర్ జీవిత విశేషాలను పరికిస్తే ఇతని సాహిత్య జీవితానికి ప్రాణం పోసిన వ్యక్తి ఆనాటి ప్రఖ్యాత అమెరికన్ నవలాకారుడు షెర్‌వుడ్ అండర్‌సన్. ఈ స్నేహితుని ప్రోద్బలంతో మొదటి నవల 'Soldier's Pay' (1929) ప్రచురించబడినది. ఫాక్నర్ యుద్ధ వైముఖ్యము, యుద్ధ కాలం నాటి నైరాశ్యము ఇందులో చక్కగా చిత్రీకరింపబడినవి. పాత్రల ఎంపికలోనూ, కథా గమనంలో కొంత బలహీనంగా కనిపించినప్పటికీ రచయిత యొక్క strong involuement (కథానిమగ్నత) ఇందులో చదువరికి స్పష్టంగా కనిపిస్తుంది. 'Mosquitoes' (1929) 'Sartories' (1929) ఇతని తరువాత రచనలు.

ఫాక్నర్ సాహిత్య జీవితంలో కెల్లా ఉన్నతమైనటువంటి దశను 'The sound and the Fury' (1930) నవలా రచన ద్వారా చేరుకొనెను. ఈ నవలలోని వాస్తవికత, నవీన కథా గమనము, తనదైనటువంటి శైలి చదువరికి ఇబ్బందిగానూ, కొత్తగానూ అనిపించి అది అమెరికాలో పొందదగినటు వంటి ప్రాముఖ్యతను మొదట పొందలేదు కానీ ఫాక్నర్ సాహిత్య జీవిత ఆరంభ దశ నుండి అతనిని అభిమానించిన యురోపియన్ ప్రత్యేకించి ఫ్రెంచి చదువరులు ఈ నవలను ఒక అద్భుత కళాఖండంగా కొనియాడారు. దీనితోటి అతని ఖ్యాతి అమెరికాలో కూడా నలుదిశలకూ వ్యాపించింది ఫాక్నర్ తన జీవితకాలంలో 52 పద్యాలు, 17 నవలలూ, 40 చిన్నకథలూ వ్రాసినప్పటికీ అన్నింటిలోకి మణిరాజం ఈ నవల. దీని కథా వస్తువు ''కుటుంబ విలువల క్షీణత''. అమెరికా అంతుర్యుద్ధము. దెబ్బతిన్న ఆర్థిక వ్యవస్థ, క్షీణిస్తున్న మానవ సంబంధాలు, పరిస్థితుల ప్రభావం వలన మానవుడి నైతిక విలువల క్షీణత, నీగ్రోల యొక్క ప్రేమాద్వేషాలు ఈ నవలలో చక్కగా వర్ణించబడినవి.

అతని యొక్క రెండవ ఉత్తమ నవలగా పేర్కొనదగినది "Light in August" (1932) దక్షిణ అమెరికాలోని నీగ్రో మరియు తెల్లవాళ్ళ మధ్య గల సంబంధాలను సునిశిత దృష్టితో పరికించి సామాజిక, మానసిక, మత, నైతిక సమస్యలపై చదువరులను ఆలోచింపజేయునట్లుగా ఈ నవలలో చిత్రీకరింపబడెను. 'Pylon', 'The unvanquished', 'The Wild Palms', 'As I lay dying' ఇతని ఇతర రచనలు. కానీ ఇవి చదువరులను అంతగా ఆకర్షించలేకపోయెను.

ఫాక్నర్ యొక్క రచనాశైలి చదువరుని శ్రమపెడుతుంది. జేమ్స్ జాయిస్ రచనా విధానంచే ప్రభావితుడై తన రచనలను Stream of Consciousness (చైతన్య స్రవంతి) శైలిలో సాగించినాడు. ప్రాంతీయ భాషా ప్రయోగాలు, అలంకారయుతమైనశైలి, పదబంధాల ప్రయోగము వెరశి ఇతని నవీన కథా గమనం పాఠకుడిని ఇబ్బంది పెడుతుంది. ''కథాని కథారచయిత నడపరాదు, దానంతర అదే చెప్పబడాలి'' అనే సిద్ధాంతాన్ని నమ్మి తన రచనలలో ఆచరించిన వ్యక్తి విలియమ్ ఫాక్నర్.

వ్యక్తి నైరాశ్యాన్ని (dejection) చిత్రీకరించడంలో ఫాక్నర్ ఏ గొప్ప రచయితనైనా మించి పోగలడనిపిస్తుంది. అందుకే ఇతని విమర్శకులు ఇతనిని నిరాశవాదిగా నిందించినారు. ఫాక్నర్ యొక్క పాత్రలు పరిస్థితుల చేతిలో ఓడిపోవచ్చు, కానీ అవి లొంగిపోలేదు. త్రాగుబోతులయినా, తిరుగుబోతులయినా, మూర్ఖులైనా, హంతకులైనా, నిరాశా వాదులైనా, వినాశా వాదులైనా ఇతని characters మానవత్వ పరిమళం మూర్తీభవించి ఉంటాయి. పాఠకులు వారిని అసహ్యించుకోలేదు. పరిస్థితులకు లోబడి నడుచుకున్నట్లు ఉంటాయే తప్ప తెచ్చిపెట్టుకున్న ప్రవర్తనలు కావు. వారు కాలసర్ప భాదితులు.

''ఒక ఉన్నతమైన కార్యసాధనలో పరాజయం పాలైతే ఆ పరాజయం కూడా ఉన్నతమే'' అని ఫాక్నర్ చెప్పినట్లుగా సంక్లిష్ట మానవ సంబంధాలను సరళంగా చిత్రీకరించడంలో ఫాక్నర్ పరాజయం పాలైనాడని విమర్శకులు భావిస్తే అతని పరాజయం కూడా విజయమే - ఉన్నతమైనది. 1949లో ఫాక్నర్‌కి అత్యున్నత సాహిత్య పురస్కారం నొబెల్ పురస్కారం అతని రచనలకు లభించింది.

# వీరులపాడు నుండి విశ్వ మానవతకు

**- టి. రవిచంద్**

భారతదేశం గ్రామ నాగరికతకు నిలయం గ్రామ నాగరికతకు మూలం వ్యవసాయం. వ్యవసాయంపై ఆధారపడిన ఈ దేశ నాగరికత, సంస్కృతి కొన్ని వందల సంవత్సరాలుగా వికాసం చెందుతుంది. అయినా గ్రామాలన్నా, గ్రామీణ వాతావరణమన్నా చాలా మంది విద్యాధికులకు చిన్న చూపు ఉంది అందువల్లనే చదువుకున్న వాళ్ళలో ఎక్కువశాతం పట్టణాల వైపు ఎగబడుతున్నారు. తమ పూర్వ మూలాల్ని (roots) మరచిపోతున్నారు. కాల ప్రవాహంలో ప్రతిదీ మారుతుంది. తప్పదు కాని ఏ మార్పయినా ఆకాశం నుండి ఏకంగా ఊడిపడదు. దానికి పునాది మనంపుట్టి పెరిగిన నేల అనే విషయాన్ని నిజమైన మార్పుని ఆహ్వానించేవాళ్ళు గుర్తించక తప్పదు. ఆధునిక విద్య, పారిశ్రామిక నాగరికత మన జీవన విధానంలో అనూహ్యమైన మార్పుల్ని తెచ్చింది. కాలగమనంలో దేశస్వరూపమే అనేకపరిణామాలకు లోనవుతుంది. గతం రూపురేఖలు మారిపోతున్నాయి. గతంలోని చెడుని వదిల, మంచిని స్వీకరించి చరిత్ర పరిణామ క్రమంలో మనిషి ఎదగాలి అలా మనిషి ఉన్నతంగా ఎదగాలంటే ఆరోగ్యకర సామాజిక వాతావరణంలో పెరగాలి. ఆరోగ్యకర సామాజిక వాతావరణంలో పెరిగిన వ్యక్తి చరిత్రగతిలో సంభవిస్తున్న పరిణామాల్ని అర్థం చేసుకొని, తాను మారుతూ, తన చుట్టూ ఉన్నవారిని కూడా ఏదో మేరకు మార్చడానికి ప్రయత్నిస్తాడు. ఆధునిక భావాలు పట్టణాల్లో పుట్టి పెరిగిన వారికే ఉండాలనే నియమం లేదు. సమాజాన్ని ముందుకు నడిపించేశక్తి ఉన్న భావాలు దేశంలోని అన్ని ప్రాంతాల్ని ఏదో రూపంలో ప్రభావితం చేస్తూనే ఉంటాయి. అయితే ఆ ప్రభావం నాగరికతా పరంగానూ ఉండవచ్చు! సంస్కృతి పరంగానూ ఉండవచ్చు నాగరికత పెరిగినంతగా సంస్కృతి పెరగదు. నాగరికత భౌతికమైనది సంస్కృతి ఒక విధంగా మానసికమైనది. భౌతిక, మానసిక రంగాల్లోని వైరుధ్యమే ఈనాటి సమాజాన్ని సక్రమంగా, సహజంగా ఎదగనీయకుండా చేస్తుంది. ఎప్పుడయితే భౌతిక, మానసిక జీవన విధానంలో తేడా, వైరుధ్యం ఎక్కువగా ఉంటుందో, అప్పుడు ఆదేశ పరిణామం కుంటుపడటానికి అవకాశం ఎక్కువగా ఉంటుంది. అదే ఈనాడు మన దేశంలో ప్రస్ఫుటమవుతుంది. ఈ పరిణామాన్ని జాగ్రత్తగా పరిశీలించిన పెద్దలు (పాత తరంవారు) మంచీచెడూ విచక్షణచేయగల వారయితే వారివల్ల భవిష్యత్తు సమాజానికి చాలా మేలు కలుగుతుంది.

చరిత్రగతిని గుర్తించిన వృద్ధులు సమాజంలో చాలా ప్రయోజనకరమైన పాత్ర నిర్వహించగలరు. అటువంటి ఉన్నతమైన పాత్ర నిర్వహిస్తున్న వారు వీరులపాడు గ్రామవాసి పాటిబండ్ల వెంకటపతి రాయలు. ఆంధ్ర రాష్ట్రంలో గ్రామ చరిత్ర రచనకు మార్గదర్శకంగా పేర్కొనబడుతున్న ''చరిత్ర గతిలో చైతన్య వాహిని వీరులపాడు'' అనే ఉత్తమ పరిశోధనా గ్రంథం రచించిన పాటిబండ్ల వెంకటపతి రాయలు 1914 డిసెంబర్28వ తేదీన కృష్ణాజిల్లా వీరులపాడు గ్రామంలో కోటయ్య; లక్ష్మీ దేవి గార్లకు జన్మించారు. వెంకట పతిరాయలు గారికి తల్లి దండ్రులు పెట్టిన పేరు వెంకట పతి. కాని ఆయనగురువుగారైన జంగా హనుమయ్యా చౌదరి (1888-1947) బ్రాహ్మణేతరోద్యమ ప్రభావంతో కమ్మవారు క్షత్రియులన్న ఉద్దేశంతో తన శిష్యుని పేరు చివర 'రాయలు' శబ్దంచేర్చారు. నాటినుండి ఆయన వెంకటపతి రాయలుగా ప్రసిద్ధులైనారు. ఆయన జన్మించిన గ్రామం అనేక సంఘ సంస్కరణోద్యమాలకు నిలయం. జాతీయోద్యమం, బ్రాహ్మణేతరోద్యమం, ఆర్య సమాజం, బ్రహ్మసమాజం లాంటి ఉద్యమాలతో పాటు హరిజనోద్యమం, గోరా నాస్తికోద్యమం,

కమ్యూనిస్టు ఉద్యమాలు ప్రచారంలో ఉన్నాయి ఆ గ్రామాన్ని జాతీయోద్యమం, బ్రాహ్మణేతరోద్యమం బాగా ప్రభావితం చేశాయి ఈ రెండు ఉద్యమాల ప్రభావం అష్టావధాని జంగా హనుమయ్య చౌదరి పై పడింది. జాతీయోద్యమం ఆయనలో దేశభక్తిని, బ్రాహ్మణేతరోద్యమం స్వసంఘాభిమానాన్ని పెంచింది కమ్మవారు చౌదరులే కాదు క్షత్రియులన్న అభిప్రాయంతో ఆయన యజ్ఞోపవీతం ధరించేవారు తన భావాల్ని ఆయన తన శిష్య వర్గంలో కూడా ప్రచారంచేసి, వారిని బ్రాహ్మణేతరోద్యమం వైపు ఆకర్షించేవారు ఆయన ప్రభావంతో అనేక మంది యువకులు జాతీయోద్యమం, బ్రాహ్మణేతరోద్యమం వైపు ఆకర్షించబడ్డారు. 'శూద్ర' కులాలుగా పరిగణించబడుతున్న కమ్మ, రెడ్డి, వెలమ, కాపు కులాలన్నీ కూడా క్షత్రియులేనని ఆనాడు బ్రాహ్మణేతరోద్యమం భావించింది ఈ ఉద్యమాన్ని ఆర్య సమాజ వాదియైన జి. ఎస్. బి. సరస్వతీ స్వాములు గట్టిగా సమర్థించారు ఆయన జన్మతః బ్రాహ్మణులు. 'శూద్ర' కులాలు క్షత్రియులేనన్నవాదనను ''ఆత్మగౌరవ ఉద్యమం''లో భాగంగా పరిగణించవచ్చు. అంతకుమించి ఆవాదనకు ఎటువంటి విలువాలేదు. అరవై, డెబ్బయి సంవత్సరాల క్రితం అగ్రకులాలన్నీ శూద్ర కులాలుగా పరిగణించబడేవి గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో అత్యున్నత స్థానం ఆక్రమించిన ఈ కులాలు వర్ణ వ్యవస్థలో శూద్రులుగా పరిగణించబడటం, ఆ కులాలలో జన్మించిన ఆలోచనా పరులకు అవమానకరంగా గోచరించింది అందువల్ల రాజ్యపాలన చేసిన శూద్రులంతా క్షత్రియులనే వాదం ఈ కూలాల వారిని అమితంగా ఆకర్షించింది. బ్రాహ్మణేతరోద్యమంలో ఆంధ్రప్రాంతంలో కమ్మకులస్థులు అగ్రస్థానంలో ఉన్నారు. ఆ ప్రభావం వీరులపాడు గ్రామంపై కనిపించింది. ఆ ప్రభావ ఫలితమే పాటిబండ్ల వెంకటపతి, వెంకటపతిరాయలుగా మారారు.

పాటిబండ్ల వెంకటపతిరాయలపై బ్రాహ్మణేతరోద్యమ ప్రభావమున్నా, దానితో ఆయన పూర్తిగా ఏకీభవించలేదు ఆ ఉద్యమంలో ఒక దశలో తలెత్తిన ఆర్య, ద్రావిడ జాతి సిద్ధాంతాల్ని, గుడ్డి బ్రాహ్మణద్వేషాన్ని ఆయన ఆమోదించలేదు. ఒక సందర్భంలో ఆర్య, ద్రావిడ వివాదాన్ని గురించి ఆయన ఇలా అన్నారు. ''నేను బ్రాహ్మణేతరోద్యమాన్ని అభిమానించినప్పటికీ, ఆ ఉద్యమంలో వినిపించే ఆర్య, అనార్య శబ్దాలు, వాటిని గురించిన చర్చలు నాకంతగా నచ్చేవి కావు. ఎన్నడో వేలకొలది సంవత్సరాల క్రితం సమసిపోయిన ఈ ఆర్య, అనార్య భేదాన్ని ఇప్పుడు మళ్ళీ త్రవ్వుకొని తగవులాడుకోవడం నాకెందుకో భావ్యమనిపించేదికాదు.'' బ్రాహ్మణేతరోద్యమంలో ఇటువంటి శాస్త్రీయ, చారిత్రక దృక్పథం లేక పోవడం వల్ల అది తర్వాత వెర్రి తలలు వేసి, మరో వర్గ ఆధిపత్య వాదానికి దారితీసింది. వెంకట పతిరాయలు ఆ ప్రమాదాన్ని ముందుగానే పసికట్టారు. ''అలనాటి ఆర్యులా - ద్రావిడులా ఎవరు ఎవర్ని తన్ని తరిమేసారనే చారిత్రక సందేహంలో - మరోసారి తన్నుక చావండి నా కొడకల్లారా!'' అని వర్తమాన విప్లవ కవి ఎంతో నిస్పృహతో అన్న మాటల్ని వెంకటపతిరాయలు అతి చిన్నవయస్సులోనే దాదాపు ఏడు దశాబ్దాల క్రితమే గుర్తించారు. బ్రాహ్మణేతరోద్యమంలో ప్రముఖులైన కవిరాజు త్రిపురనేని రామస్వామికి వెంకటపతి రాయలు జూనియర్ సమకాలికులు. ఆయన ప్రభావం వెంకటపతిరాయలుపై ఉంది. బ్రాహ్మణేతరోద్యమాన్ని ఆయన ఎంత విమర్శనాత్మకంగా పరిశీలించి బలపరిచారో, అలాగే కవిరాజు త్రిపురనేనిని కూడా బలపరిచారు. ఆంధ్రులకు ప్రశ్నించడం నేర్పిన కవిరాజు రామస్వామి గారి సిద్ధాంతాల్ని ఆయన నిశతంగా పరిశీలించారనిపిస్తుంది. అందువల్లే ఆయన కవిరాజు త్రిపురనేని రామస్వామికి నిజమైన వారసుడు కాగలిగాడు. ఆత్మ గౌరవం కోసం బయలుదేరిన ఉద్యమాల్లో తొలి దశలో అతివాద పోకడులు ఉండటం సహజమే. కాని ఆ ఉద్యమాల్ని

తరువాత ముందుకు తీసుకెళ్ళేవారు తొలిదశలో తలెత్తిన ఇటువంటి అహేతుక ధోరణుల్ని అధిగమించి ముందుకునడపాలి. ఆ పని వెంకటపతిరాయలు చేశారు. అదే వారి విశిష్టత.

వెంకట పతిరాయలు వ్యవసాయ కుటుంబంలో పుట్టినప్పటికీ వారి దృష్టి మాత్రం వ్యవసాయం మీద కంటే చదువుమీదే ఎక్కువ ఉండేది. ఆ ఆసక్తితో ఆయన తెలుగు, హిందీ భాషల్లో పాండిత్యం సంపాదించారు. అధ్యాపక వృత్తిని స్వీకరించారు తిలక్ జాతీయ పాఠశాలను స్థాపించి 1947 వరకు విజయవంతంగా నిర్వహించారు. తరువాత హిందీ అధ్యాపకులుగా కృష్ణా జిల్లా పరిషత్ పాఠశాలలో పనిచేసి 1970లో పదవీ విరమణ చేశారు. కాలగమనమే ఆయనను సంస్కరణోద్యమాలవైపు ఆకర్షించింది. తన కార్యకలపాలన్నీ వీరులపాడు గ్రామంలో నిర్వహిస్తుండేవారు. 1937 సంవత్సరంలో తమ గ్రామంలో ప్రవేశించిన కమ్యూనిస్టు ఉద్యమం కూడా ఆయనను ప్రభావితం చేసింది. ''అది ఒక మహోన్నత జీవన విధానము''ని ఆయన విశ్వసిస్తారు. కాని కొన్ని కారణాలవల్ల కమ్యూనిస్టుపార్టీలో చేరలేదంటారు. ఆ కారణాలేవో తెలిపితే బాగుంటుంది.

ఇలా వివిధ ఉద్యమాలలోని తనకు ప్రగతి శీలమనిపించిన భావాలను స్వీకరించి వెంకట పతిరాయలు ఒక విశిష్ట వ్యక్తిగా రూపొందారు. ఆయనకు చిన్న నాటి నుండి కవిత్వాలపై ఆసక్తి ఉండేది. అప్పుడప్పుడు కవితలు రాస్తుండే వారు. ఆనాడు ఆరంగంలో తన ఆసక్తిని, అభిరుచిని పెంపొందించుకోలేకపోయారు. చాలా ఆలస్యంగా బెజవాడ గోపాలరెడ్డిలా కవిత్వ రంగంలోనికి ప్రవేశించి ''మిత్ర ప్రబోధం'' అనే కవితా సంకలనాన్ని వెలువరించి ప్రసిద్ధ విమర్శకుల ప్రశంసలందుకున్నారు. వృద్ధాప్యంలో రచనా వ్యాసంగం వైపు దృష్టి మరల్చారు. ఇప్పటికి మూడు గ్రంథాలు రచించి ప్రచురించారు. అవి. 1. చరిత్ర గతిలో చైతన్య వాహిని వీరులపాడు (1992) 2. మిత్ర ప్రబోధం (1995) 3. పాటిబండ్ల అక్కయ్య గారి వంశ చరిత్ర (1997). ఇంకా ప్రచురించాల్సిన గ్రంథాలుకొన్ని ఉన్నాయి. 1. నాలో నేను 2. కులాంతర వివాహాలు - ఒక సర్వే. పాటి బండ్ల వెంకట పతి రాయలు వీరులపాడు గ్రామంలో ప్రవేశించిన అనేక సంస్కరణోద్యమాల ప్రభావంతో అభ్యుదయ పథంవైపు పయనిస్తున్నారు. వృద్ధాప్యం ఈ దేశంలో చాలా మందికి ఒక శాపం లాంటిది. కాని ఆయనకు వృద్ధాప్యం - ఎరిక్ ఫ్రామ్ మాటల్లో చెబితే - గొప్ప ఛాలెంజి, గొప్ప ఛాన్స్ వృద్ధాప్య దశలోని విలువైన సమయాన్ని, స్వేచ్ఛను సద్వినియోగం చేస్తూ, ఎనిమిది దశాబ్దాల జీవితానుభవంతో వెంకటపతిరాయలు ఎంతో ఎత్తుకి ఎదిగారు. కాల గతిలో వస్తున్న మార్పుల్ని పరిశీలిస్తున్నారు. వాటిలో మంచి మార్పుల్ని మనసారా ఆహ్వానిస్తున్నారు. ఆయన కార్యక్షేత్రం, జీవితానుభవం వీరులపాడు గ్రామానికే పరిమితమయినా, ఆయన లక్ష్యం విశ్వమానవ సౌభ్రాతృత్వం. కాల గతిని గుర్తించిన వ్యక్తి గ్రామంలో ఉన్నా, పట్టణంలో ఉన్నా ఉన్నత స్థాయికి ఎదుగుతాడని వెంకటపతి రాయలు జీవితమే నిరూపిస్తుంది. ఆయన తొలిదశలో జాతీయోద్యమం, బ్రాహ్మణేతరోద్యమం వల్ల ప్రభావితమయితే మలి దశలో కమ్యూనిజం, విశ్వ మానవతా భావనలవల్ల ప్రభావితులయ్యారు. ఈ వివిధ ప్రగతిశీల, అభ్యుదయ భావాల సంగమం వెంకటపతి రాయలు. బ్రాహ్మణేతరోద్యమం వల్ల కమ్మవారు క్షత్రియులేనని భావించినా ఆయన విశ్వ మానవతా దృష్టితో కుల రహిత సమాజాన్ని కాంక్షిస్తూ, వర్ణాంతర, కులాంతర, రాష్ట్రాంతర వివాహాలను ప్రబోధిస్తున్నారు. వీరులపాడు నుండి ఆయన మహాప్రస్థానం విశ్వమానవతకు చేరుకున్నది.

గ్రామ చరిత్రను, వంశ చరిత్రను రచించిన వ్యక్తి దృక్పథం సంకుచితమని కొంతమంది భావించవచ్చు. నిజానికి గ్రామ చరిత్రకాని వంశ చరిత్ర కాని దేశ చరిత్రలో అంతర్భాగమని గుర్తించాలి. ప్రపంచ చరిత్రలు, దేశ చరిత్రలు రచించిన వారిలో సంకుచిత దృక్పథం కలవారు లేరా? ప్రజల మధ్య వైషమ్యాలు, అపోహలు సృష్టించిన వారు లేరా? ఉన్నారు. తమ పునాదిని, మూలాన్ని మరిచిపోనివారే నిజమైన విశ్వమానవులుగా రూపొందుతారు. మానవాళికి విశిష్ట సందేశ మందించగలరు. ఏ చరిత్ర రచించినా ఏ దృష్టితో రచించారన్నది ప్రధానం. దృష్టి సంకుచితమైనదైతే అది ప్రపంచ చరిత్రయినా, దేశచరిత్రయినా ప్రమాదకరంగా పరిణమించవచ్చు. దృష్టి విశాలమైనదైతే అది గ్రామ చరిత్రయినా, వంశచరిత్రయినా ఎంతో ప్రయోజనకారి కాగలదు. పాటిబండ్ల వెంకటపతి రాయలు రచించిన గ్రామ చరిత్ర, వంశ చరిత్ర రెండూ మానవతా వాద దృష్టితో రచించినవే. గ్రామ చరిత్ర పేరుతో ప్రాంతీయ దురభిమానాన్ని ఆయన ప్రబోధించలేదు. వంశ చరిత్రను అత్యుక్తులు, అతిశయోక్తులతో నిలపలేదు. రెండు చరిత్రల రచనలో.... ఆయన ఎంతో నిష్పాక్షిక దృష్టిని, మానవతా వాదాన్ని ప్రదర్శించారు. వంశ చరిత్రలు, గ్రామచరిత్రలు, ప్రాంతీయ చరిత్రలు రచించేవారిలో ఇటువంటి ఉన్నత సంస్కారం ఉండటం చాలా అరుదు. అది వెంకట పతి రాయలు ప్రత్యేకతగా చెప్పుకోవాలి. ఆ ఉన్నత సంస్కారం వల్ల ఆయన వీరులపాడు గ్రామంనుండి విశ్వమానవత వరకు ఎదగ గలిగారు. తాను పుట్టి పెరిగిన తనకు తెలిసిన సమాజ చరిత్రను నిరపేక్షంగా చిత్రించగలిగిన చరిత్ర కారుడి రాతలవల్ల సమాజానికి ఎంతో ఉపయోగం ఉంటుంది. ఉన్నత భావాలు, ఉత్తమ సంస్కారం గల వెంకట పతి రాయలు వీరులపాడు గ్రామ చరిత్రను, పాటిబండ్ల అక్కయ్య వంశ చరిత్రను దేశ చరిత్రలో భాగంగా రచించారు. వీరులపాడు గ్రామానికి పాటిబండ్ల వంశానికి ఉన్న పరస్పర సంబంధాన్ని ఆయన రెండు గ్రంథాలలో పొందు పరిచారు. ఆధునిక రాష్ట్రం వివిధ ఆధునికోద్యమాల ప్రభావానికి గురయి ఎలా చైతన్య వాహినిగా మారిందో, అదే విధంగా వీరులపాడు గ్రామం చైతన్య వాహినిగా మారింది. ఆ గ్రామంలోని వంశాలలో ప్రసిద్ధ వంశమైన పాటిబండ్ల వంశం కూడా ఆధునిక భావాల ప్రభావానికి లోనయింది.

చరిత్ర గతిలో చైతన్య వాహిని వీరులపాడు గ్రంథంలో ఆ గ్రామం రెండు వందల ఏండ్ల చరిత్రను అక్షర బద్ధం చేశారు వెంకటపతి రాయలు. వృత్తి రీత్యా చరిత్ర కారుడు కాని ఒక వ్యక్తి గ్రామ చరిత్రను విశ్లేషించి రాయడం నిజంగా మెచ్చుకోదగిన విషయం. మన గ్రామవ్యవస్థ ఒక విధంగా కుల వ్యవస్థపై ఆధారపడింది. అటువంటి గ్రామాల చరిత్ర రచించేటప్పుడు రచయితకు నిష్పాక్షికదృష్టి, సానుభూతి ఉండాలి. 1990 నాటికి వీరులపాడు గ్రామంలో ఇరవైరెండు కులాల వారున్నారు. గ్రామ చరిత్రలో ఈ కులాల పుట్టు పూర్వోత్తరాలను గురించి చర్చించేటప్పుడు రచయిత ఎంతో సంయమనాన్ని పాటించారు. ఇందులో ఆ గ్రామంలోని వివిధ వృత్తులు, కులాలు, మతాలకు సంబంధించిన అనేక పరిణామాల్ని నిరపేక్షకంగా చర్చించారు. ఎటువంటి సామాజిక అపోహలు, అభిమాన, దురభిమానాలు లేకుండా గ్రామంలోని అన్ని వర్గాల, వర్ణాల, కులాల చరిత్రను చిత్రించడం అపూర్వమైన విషయమనడంలో అతిశయోక్తి ఏమాత్రంలేదు. బ్రాహ్మణేతరోద్యమానికి, జాతీయోద్యమానికి, కమ్యూనిస్టు ఉద్యమానికి కేంద్రంగా ఉన్న వీరులపాడు చరిత్ర చదువుతుంటే, ఆకాలంలో ఆంధ్రదేశంలో సంభవించిన అనేక సామాజిక పరిణామాల్ని ప్రత్యక్షంగా చూసినట్లనిపిస్తుంది. అందువల్లనే సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకులు,

మార్క్సిస్టు మేధావి ఏటుకూరు బలరామమూర్తి '' ఇది పరిశోధకులకు మార్గదర్శకం'' అని వెంకట పతి రాయలు కృషిని ప్రశంసించారు.

రెండు వందల సంవత్సరాల కాలంలో ఆ గ్రామంలో ఎటువంటి మార్పులు సంభవించాయో వివరిస్తూ, 1960 తరువాత కలిగిన మార్పుల్ని ఆలోచనాత్మకంగా చిత్రించారు వెంకట పతి రాయలు క్రీ.శ. 1900 వరకు ఆగ్రామం ఆంధ్రదేశంలోని అన్ని గ్రామాల వలె మామూలు గ్రామంలా ఉండేది. 1900 తరువాత ఆ గ్రామంలో కొన్ని ముఖ్యమైన మార్పులు జరిగాయి. మార్పులకు కారణం బ్రాహ్మణేతరోద్యమం, జాతీయోద్యమాలు. 1965 తరువాత ఆ గ్రామంలో సామాజికంగా ఒక విధమైన స్తబ్దత ఆవరించింది. అంతవరకు మహోన్నత విలువలకు కూడలిగా ఉన్న గ్రామం కులతత్వ ప్రకోపానికి గురయిందని ''బలమైన దుష్ట వాతావరణం ఒకటి గ్రామంలో బలం పుంజుకొనుచున్నట్లు కనిపించుచున్నది. అది ''కుల తత్వ ప్రకోప''మని ఆయన చాలా నిజాయితీగా, నిర్మొహమాటంగా రాశాడు వెంకటపతిరాయలు తమ గ్రామంలో గుర్తించిన విషతుల్యమైన సామాజిక వాతావరణం ఒక్క వీరులపాడు గ్రామానికే పరిమితమయి లేదు. అది ఆంధ్ర రాష్ట్రాన్నంతటినీ కబళించి వేస్తుంది. అయితే వీరులపాడులో కొత్తగా బయలు దేరిన సంకుచిత కులతత్వంతో పాటు, ఆ గ్రామంలో పూర్వం ఉన్న అభ్యుదయ ఉద్యమాల ప్రభావం వల్ల, ఇంకా ఎంతో కొంత పురోగామి దృక్పథమున్నదని, అందువల్లే'' ఆ గ్రామంలో జరుగుతున్న కులాంతర, వర్ణాంతర వివాహాలు కొంతవరకైనను సంతోషాన్ని కలిగించుచున్నాయి'' అని ఆయన ఆనందాన్ని వ్యక్తీకరిస్తున్నారు. ''తొలుత మానవులందరు ఒకటే అనియు, తరువాత, తరువాత వారిలో పనులనుబట్టియో, అధికార దర్పమును బట్టియో, స్వభావము బట్టియో, అలవాట్లను బట్టియో కొన్ని విభేదాలు ఏర్పడ్డాయి. అవియే తరువాత హిందూ సమాజంలో వర్ణాలు, కులాలు, వంశాలుగా పరిణామం చెందాయి'' అని అనగలిగిన రచయిత సామాజిక దృష్టి విశిష్టమైనదనడంలో ఎటువంటి సందేహం లేదు. చరిత్రలో ఎటువంటి ఉన్నత డిగ్రీలు లేని ఒక వ్యక్తి చారిత్రక బాధ్యతగా భావించి తాను పుట్టి పెరిగిన గ్రామ చరిత్రను గ్రంథస్థం చేయడం ద్వారా ఆయన ఆంధ్రులకెంతో మేలుచేశారు. ఆంధ్రప్రదేశ్ చరిత్ర కాంగ్రెస్ వెంకట పతి రాయలు కృషిని గుర్తించి, సముచిత రీతిలో సత్కరించి, యువ చారిత్రక పరిశోధకులకు ప్రాంతీయ చరిత్రల అధ్యయనానికి ప్రేరణ నివ్వాలి.

ఆధునిక భావాలవైపు ఆకర్షితులవ్వాల్సిన యువతరమంతా 'ఆదిమ తెగల' మనస్తత్వాన్ని ప్రదర్శిస్తున్న తరుణంలో వెంకట పతి రాయలు యనభై ఏళ్ళ వయస్సులో గ్రామ చరిత్ర, వంశ చరిత్రలలో వర్ణాంతర, కులాంతర, రాష్ట్రాంతర వివాహాన్ని ఆహ్వానిస్తూ, తమ గ్రామంలో, వంశంలో జరుగుతున్న ఈ వివాహాల్ని ''విశ్వమానవతకు దోహదమొసగే ఈ వివాహాలు చోటు చేసికొనుచుండుట మిగుల ప్రశంసదాయక విషయం'' అంటున్నారు. తమ గ్రామ వంశమూలాల్ని అన్వేషించిన ఈ 'వృద్ధుడు' పాత తరం కాలంచెల్లిన భావాలకు ప్రతినిధి కావాల్సింది పోయి, నవతరం నవభావాలకు ప్రతిధ్వనిగా, కవిరాజు త్రిపురనేని రామస్వామి గారి నిజమైన వారసుడిగా, వీరులపాడు నుండి విశ్వమానవత వరకు ఎదిగారు వయస్సు రీత్యా వృద్ధులు, మానసికంగా యువకులైన వెంకటపతి రాయలు మార్గంలో, వయస్సు రీత్యా యువకులు, మానసికంగా వృద్ధులైన నేటి తరం వారు పయనించే ఆదిమ తెగల మనస్తత్వాన్ని విసర్జించి, ఆధునిక భావాల్ని స్వీకరిస్తారని ఆశిద్దాం.486

# పునర్జన్మ - ఒక పరిశీలన

- డా. యన్. ఇన్నయ్య

మనిషి ఒక్కసారే పుట్టి పోడనీ, ఎన్నో సార్లు జన్మ ఎత్తుతాడనీ, అందులో జంతువులు యితర జీవ జాలం కూడా వుండొచ్చుననీ, ప్రతి జన్మకూ కొత్త దేహం వస్తుందనీ నమ్ముతారు ఇది ఆద్యంత రహితంగా సాగుతుందని కొందరూ, నిర్వాణంతో జన్మ ముగుస్తుందని కొందరూ నమ్మారు.

కర్మ సిద్ధాంతానికి మంచి చెడ్డలను జత చేస్తారు. ప్రస్తుత జన్మకు కారణం లోగడ జన్మలలో చేసిన మంచి, చెడ్డలు కారణం అంటారు. వీటిలోనే శిక్షలు, బహుమతులు కూడా యిమిడి వున్నాయి.

ఈ పునర్జన్మ కర్మ సిద్ధాంతాలు నమ్మిన వారిలో సుప్రసిద్ధ వ్యక్తులున్నారు. కనుక సిద్ధాంతం సరైనదని చెబుతారు.

టి.హెచ్. హక్సలీ 1893లో పరిణామం నీతి గురించి చెబుతూ వంశ పారంపర్యంగా శీలం రావడం కర్మ సిద్ధాంతం వంటిదన్నాడు. ఇంకేముంది? హక్సలీ సైతం పునర్జన్మను అంగీకరించాడన్నారు! ఆయన మనస్సు - శరీరం సమస్య చర్చించే సందర్భంగా ఆ ప్రస్తావన తెచ్చాడు. మరణానంతరం మానవుడు వుండడని కచ్చితంగా హక్సలీ పేర్కొన్నాడు.

పునర్జన్మ వాదుల ప్రకారం తల్లి దండ్రులు నిమిత్తమాత్రులు. మానవుడిలోని అనేకగుణాలకు తల్లి దండ్రులు కారణం కాదన్నారు.

పునర్జన్మను నమ్మిన ఎఫ్.డబ్ల్యు.హెచ్ మైర్స్ (Myers) గురించి బెర్ట్రాండ్ రస్సెల్ చతురోక్తిగా చెబుతూ, ఒక విందులో చనిపోయిన తరువాత నీవు ఏ మౌతావని మైర్స్‌ను ఒకరు అడిగారట. శాశ్వతానందం లభిస్తుందని మైర్స్ అంటూనే, తినేటప్పుడు అలాంటి అప్రియ ప్రస్తావన ఎందుకన్నాడట! అలాగే పునర్జన్మ నమ్మిన ఒక తండ్రికి అత్యవసరంగా ఆపరేషన్ చేయాల్సిరాగా అతడు దిగాలుపడి వున్నాడట. అతడి కుమారుడు చూచి, నాన్నా, నీకు పునర్జన్మపై నమ్మకం వుందిగా, ఏం ఫరవాలేదన్నాడట. అందుకు తండ్రి మండిపడి, ఇలాంటి సందర్భంలో హాస్యంగా మాట్లాడొద్దన్నాడట!

ప్రపంచంలో వున్న అన్యాయం, అక్రమం చూస్తుంటే, దేవుడున్నాడని, కనుక న్యాయాన్యాయాలు నిర్ణయించడానికి, పునర్జన్మలు కర్మలు వుండాలి అంటారు కొందరు. కార్యకారణ వాదం కూడా యిందులోకి తెస్తుంటారు. కాని ఆ వాదం ప్రకారం అన్యాయాలకు, అక్రమాలకు కారణమైన చెడ్డ దేవుళ్ళు వుండాలి. మానవులు సంతోషంగా వుండడానికి హామీయిచ్చే నియమం ఏదీ లేదని రస్సెల్ చెప్పిన విషయాన్ని గుర్తుంచుకోవాలి.

(కర్మ సిద్ధాంతాన్ని పరిశీలిస్తే, ఇందులో భవిష్యత్తు. అంచనా వేసే రీతి లేదని గ్రహించవచ్చు). అనిబెసెంట్, బ్లావట్స్కి రాసిన విషయాలు, ప్రొఫెసర్ జి ఆర్. మల్కాని - ప్రొఫెసర్ వారెన్

స్టెయిన్ క్రాస్ మధ్య ఫిలసాఫికల్ క్వార్టర్లీ (1965) లో జరిగిన చర్చను ఇక్కడ ఉదహరించవచ్చు కొన్ని మార్మిక విషయాలు మనకు తెలియవని, చర్చించరాదని మల్కాని అన్నారు ఏ పాపానికి ఏ శిక్ష విధించాలి అనేది అలాంటిదే అన్నారు. ఈ లోకంలో యింత శిక్ష, అన్యాయం ఎందుకున్నదో మనం వివరించలేమన్నాడు

కొందరు దేవుడితో నిమిత్తం లేకుండా, కర్మ దానంతట అదే పనిచేస్తుందని నమ్ముతారు. కర్మ సహజ సిద్ధాంతం అని మల్కానీ వంటి వారు నమ్మారు

ఏది మంచి, ఏది చెడ్డ అనేది ఎక్కడ ఎవరు నమోదుచేస్తారు? దానిని బట్టి ఫలితం నిర్ణయించే తీరు ఎలా వుంటుంది? నిర్ణయాలు ఎవరు తీసుకున్నా వాటిని అమలు పరచేదెలా? అంటే లోగడ చేసిన పనులకు వచ్చే జన్మలో ఫలానా మనిషిగా పుట్టాలని నిర్ణయిస్తే అదెలా అమలుజరుగుతుంది? భూకంపంలో వేలాది మంది చనిపోవడం కర్మ వలనా? టెర్రరిస్టులు కొందరిని చంపడం కర్మ సిద్ధాంతమా? కర్మను వెనకేసుకొచ్చే మల్కాని వంటి వారు యిలాంటి వాటికి సమాధానం చెప్పజాలరు.

పునర్జన్మలు కర్మ ప్రకారం వస్తాయని అనిబొసెంట్ నమ్మినా, ఉత్తరోత్తరా జన్మలకు తగిన దేహాలను ఎలా వెతికి తెస్తారో చెప్పలేక పోయారు. మూకుమ్మడి హత్యలు, భూకంపాలు న్యాయంగా కర్మ ప్రకారం సంభవించాయని చెప్పగలరా? అల్లాగైతే కోట్లాది యూదులను నాజీలు హతమార్చడం కర్మ ప్రకారం న్యాయం కావాలి.

తార్కికంగాగాని, శాస్త్రీయంగాగాని, కర్మ నిలబడదు గానీ (ఈ విషయంలో ప్రాచ్యపాశ్చాత్య సిద్ధాంత కారులను పాల్ ఎడ్వర్డ్స్ పరిగణనలోకి తీసుకున్నారు. ఎ.జె. అయ్యర్ వంటి బ్రిటిష్ తాత్వికుల భావాలు కూడా ప్రస్తావించారు.)

## బెనర్జి హెచ్. ఎన్.

పూర్వజన్మలగురించి ఇండియాలో కొన్నేళ్ళ క్రితం సంచలనం సృష్టించిన హెచ్. ఎన్. బెనర్జి గురించి చూదాం బెనర్జి అమెరికాలో కూడా కొంత ప్రచారం పొందాడు. ఒక కేంద్రం కూడా నెలకొల్పి, మూసేశాడు. ఏన్ మిల్లర్ అనే సినీతార పూర్వజన్మలో ఈజిప్టు రాణి హత్సెసుట్ అన్నాడు. అతడి పుస్తకాలు డబుల్‌డే ప్రచురణ కర్తలు వెలువరించారు. తరవాత బెనర్జిని ఇండియాలో అరెస్టు చేశారు. అతడివన్నీ కట్టుకథలని తేలింది. యు.జి.సి వారు కూడా కొంత నిధిని సమకూర్చి తరువాత నాలుక కొరుక్కున్నారు అమెరికాలో అతడు ఓక్లొహోమా రాష్ట్రంలో షోఫెన్‌బర్గ్ రీసెర్చ్ ఫౌండేషన్ పెట్టి మూసేశాడు.

పూర్వజన్మలే గాక, రానున్న జన్మలు కూడా చెప్పడం మామూలే. ఫ్యూచరాలజీ పేర వీరు చెప్పేవన్నీ కొన్ని వందల వేల ఏళ్ళ అనంతరం జరుగుతాయంటున్నారు. కనుక రుజువుకు నిలబడవు

గత జన్మల విషయం సాధారణంగా గుర్తుండవంటారు ఎక్కడో కొందరు గుర్తున్నాయన్నప్పుడు, సంచలనం జరిగింది ఇండియాలో యిలాంటివి అప్పుడప్పుడు ప్రచారంలోకి వచ్చాయి

కృష్ణుడికి గతజన్మలన్నీ గుర్తున్నాయట. బౌద్ధులకు గత జన్మలు తెలుస్తాయని టిబెట్‌లో నమ్ముతారు అనిబెసెంట్ తన గత జన్మల గురించి చెప్పింది జన్మలలో తేడా వచ్చినప్పుడు ఏమీ సంజాయిషీ వుండదు అయితే యివేవీ రుజువులకు నిలబడవు

## సాయిబాబా

సాయిబాబా అతీంద్రియ శక్తులు, నిర్ణయాలు అంగీకరించిన స్టీవెన్సన్ గురించి రాస్తూ పరిశోధనకు, రుజువుకు నిలబడకపోవడాన్ని ప్రస్తావించారు. గాలిలోనుండి చేయి చాపి వస్తువుల్ని సృష్టించగలిగితే, కొన్ని భౌతిక సూత్రాల్ని అధిగమించి పోయినట్లవుతుందన్నారు. అది conser vatıor. principle కు దాటి పోయినందున సైన్స్‌లో గొప్ప విషయం అవుతుందనీ, ఆయన ప్రతిష్ఠ యినుమడిస్తుందనీ, కనుక రుజువుకు అంగీకరిస్తే బాగుంటుందన్నారు. సాయిబాబాను పరీక్షించడానికి శాస్త్రజ్ఞులు, మాంత్రికులు తగిన వారన్నారు.

మద్రాసు క్రిస్టియన్ కాలేజిలో రిటైర్ అయిన సి టి.కె. చారి అతీంద్రియ శక్తులు గురించి చాలా రాశారు. చిన్న పిల్లల పునర్జన్మల గురించిన విషయాలు పచ్చికట్టు కథలని ఆయన రాశారు.

దేవుడు నిర్వికారుడు, సర్వాంతర్యామి అనే వాదనను చూస్తే అలాంటి దేవుడికీ, మనుషులకూ, ప్రపంచానికి ఎలా సంబంధం వుంటుందో అడిగారు. మనుషుల ప్రార్థనలు అలాంటి దేవుడికి ఎలా వినిపిస్తాయని అడిగారు. ఒకవేళ వింటే, తన శక్తిని యీ ప్రపంచంలోకి ఎలా పంపిస్తాడని తెలుసుకోవాలన్నారు. కేవలం మనస్సు (Pure Mınd) భౌతిక ప్రపంచంతో ఎలా సంబంధం పెట్టుకుంటుందనేది అవగాహనకానిది.

ఒకే ఆకారం లేదా శరీరం రెండు చోట్ల వుండడం, పరకాయ ప్రవేశం, రెండు జన్మల మధ్య ఆత్మ నిరాకారంగా తిరగడం, ముసలివాడుగా చనిపోయి, పిల్లల్లో పుట్టడం యిలాంటి వన్నీ రచయిత చర్చించారు. మరోజన్మలో పునర్జన్మ సిద్ధాంతానికి విరుద్ధంగా 5 వాదనలు ఉన్నాయి. పరిణామ సిద్ధాంతం పునర్జన్మని తృణీకరిస్తుందని చూపారు. బిగ్ బాంగ్ తరువాత చాలా కాలం జీవం పరిణమించలేదు. అప్పుడు ఆత్మలు లేదా జన్మలు, ఎక్కడ వున్నాయి?

పునర్జన్మ సిద్ధాంతానికీ జనాభా పెరుగుదలకూ వున్న వైరుధ్యం ఉంది. మానవశరీరంలోనే మానవుడి ఆత్మ వుండగలదంటే జనాభా సిద్ధాంతంలో యిమడదు. కొత్త ఆత్మలు పుట్టవనీ, ఆత్మలు అనాదిగా శాశ్వత మనీ అంటే, జనాభా సిద్ధాంతం దీనిని తిప్పికొడుతుంది.

అటుపాశ్చాత్యులు యిటు ప్రాచ్యవాదులు నమ్ముతున్న కర్మ పునర్జన్మ సిద్ధాంతాలను విపులంగా పరిశీలించిన గ్రంథం. పూర్వాపరాలన్నీ ప్రస్తావించి, చివరకు శాస్త్రీయాధారాలకు నిలవబోవడం లేదని చాటారు.

ఇండియాలో జరిగినట్లు వింతగా నమోదైన అనేక పునర్జన్మ విషయాలను రచయిత ప్రస్తావించారు. తాను కొలంబియా యూనివర్శిటీలో చదువుతుండగా వేద ప్రకాశ్ మన్దలా అనే సహపాఠి ఎన్నో ఉదంతాలు చెప్పాడట ఏమీ చదువుకోని ఒక రైతు ఒకనాడు పొద్దున్నే లేచి ధారాళంగా సంస్కృతం మాట్లాడాడట అలాగే 1926 ఉత్తరాదిలో జరిగినట్లు ప్రచురితమైన జగదీష్ పునర్జన్మ విషయాలు పేర్కొన్నారు. వాటిలో పూర్వాపరాలు చూడకుండా శాస్త్రీయ పరిశీలన చేయకుండా ఎలా నమ్మారో చూపారు. ఈ విషయమై సి టి కె చారి రాస్తూ మత పరంగా కొందరు అబద్ధాలు ఆడడం, కథలు అల్లడం, పవిత్రత పేరిట ఆనవాయితీగా వచ్చినట్లు స్పష్టంచేశారు. పునర్జన్మ కథలలో భాష్య కారులను, నిలబడి చూచేవారిని, తల్లిదండ్రులను నమ్మజాలమని, ప్రశ్నించాలని చారి రాశారు

రాకేష్ గౌర్ పునర్జన్మ ఉదంతం ఇండియాలో జరిగినట్లు ప్రచారంలోకి వచ్చింది ఇది పేరా సైకాలజి జర్నల్‌లో ప్రచురితమైంది 1981లో 1969లో పుట్టిన రాకేష్ గౌర్ తోంక్ అనే నగరంలో విఠల్ దాస్‌గా పుట్టి గిట్టినట్లు చెప్పిన కథయిది. రాకేష్ ప్రయాణం, వెంట తండ్రి వుండడాన్ని రాశారు.

పాశ్చాత్యులు రాసేసరికి నమ్మేస్తారు పాశ్చాత్యులలో మనకంటె మన్మకస్తులున్నారని మరవకూడదు శాస్త్రీయ పరిశోధనా పద్ధతులు అన్వయించి పరిశీలించారా లేదా అనేదే ప్రధానంగా చూడాలి. రచయిత యీ దృష్టితో గమనించి, నమ్మకాలను నిరాకరిస్తున్నారు.

అబద్ధాలు కొన్నాళ్ళకు నిజాలుగా ప్రచారంగావడం, ఒక్కొక్క వ్యక్తి తన అబద్ధాలను ఉత్తరోత్తరా, నిజమని తానే నమ్మడం చూస్తున్నాం. పునర్జన్మ, కర్మ నమ్మకాలలో యిలాంటివి వున్నాయి ముందుగానే నమ్మి, వెళ్ళి చూస్తే అద్భుతాలు జరిగినట్లే వుంటాయి. వాటిని నిశితంగా పరిశీలించే శక్తి నమ్మకస్తులకు వుండదు. ఇది చదువుకున్న వారికి, కొన్ని సందర్భాలలో శాస్త్రజ్ఞులకూ వర్తిస్తుంది శాస్త్రజ్ఞులను సైతం అద్భుత మాయా జాలంతో మోసగించవచ్చు. కనుక పరిశీలక బృందాలలో మంత్ర జాలం తెలిసిన వారిని చేర్చితే చాలా వాస్తవాలు బయటపడతాయి

కొందరికి అద్భుతశక్తులు వస్తాయి. అవి ఎలా వచ్చాయో పరిశీలించే బదులు, ఆ వ్యక్తి చుట్టూ కథలు అల్లడం, పునర్జన్మ శక్తులు అంటగట్టడం కూడా ఉండాలి. ఐరిష్ గణిత శాస్త్రజ్ఞుడు విలియం హామిల్టన్ (1805-1865) 13 భాషలతో పండితుడు. చిన్న తనంలోనే గణితంలో విశేష ప్రజ్ఞ కనబరిచాడు. ఇలాంటి కోవలో మొజార్ట్ వంటి వారున్నారు. ఇదంతా పూర్వజన్మ సుకృతం అని నమ్మేవారున్నారు. అది శాస్త్రీయ పద్ధతి కాదు. పరిశీలించి తెలుసుకోవడమే ఉత్తమం. అయితే మనకు తెలియని వాటి పట్ల, ఏదొక కట్టుకథ అల్లే బదులు, రుజువులు దొరికే వరకూ వేచివుండడం, పరిశీలన కొనసాగించడం ఉత్తమ విధానం.

REINCARNATION - A Critical Examination Paul Edwards

Promothers Books, USA

# మారాందాయి మహాశ్వేతా దేవి

– మధుసూదన్. కె

నిబద్ధత అంటే ఏమిటి? కవులకు, రచయితలకు నిబద్ధత ఉండాలా....!? అన్న విషయం మీద ఎన్నో చర్చలు జరిగాయి. ఇంక జరుగుతున్నాయి.

నిబద్ధతగాని వుంటే కవుల, రచయితల పరిధి చాల సంకుచితం అయిపోతుంది. కవుల, రచయితల ఆలోచన పరిధి చాల విస్తృతమైనదై వుండాలి వారి సాహితి సృజన అందరి హితం కోరేదై వుండా... లని వాదించే వారూ వున్నారు.

అయితే, నిబద్ధత లేకుండ అసలు సాహితీ సృజన ఏముంటుంది..!? ఏదోరకమైన నిబద్ధత అందరికి వుండేతీరుతుంది. ప్రాచీన సంప్రదాయాలు, సంస్కృతి మంటగలిసి పోతున్నాయి. వాటిని పునరుద్ధరించాలి అనే ఆసక్తితో రచనా వ్యాసంగం చేపట్టిన వారికి అదే నిబద్ధత. అలాక్కాదు, సమాజంలో ఉన్నవాళ్ళు లేనివాళ్ళు వున్నారు. దోచుకునెవారు, దోపిడికీ, పీడనకు గురయ్యేవాళ్ళు వున్నారు. దోచుకునెవారికి అండగ నిలబడి అడుగడుగున ఆదుకోడానికి సిద్ధంగా ఎంతోమంది వుంటారు. అలా కాకుండ... ఏ అవసరంలేకుండా అనుక్షణం పీడనకు, దోపిడికి గురవుతున్న వర్గం పక్కన నిలబడి భుజం కాయాలి. అణగదొక్కబడే వారికి అండగనిలచి చేయూతనివ్వాలని నిబద్ధతతో రచన చేసెవాళ్ళువున్నారు. ముందునడుస్తున్న సమాజాన్ని వెనక్కు లాగే ప్రయత్నం చేయడం తిరోగమనం. ముందునడుస్తున్నదాన్ని మరింత వడివడిగ ముందుకు సాగేప్రయత్నం చేయడం పురోగమనం. ఆధునికులు, అభ్యుదయవాదులు అంతా కోరుకునేది పురోగమనాన్నే.

యువతరం కత్తులైనా పట్టాలి, కత్తుల్లాంటి కలాలైన పట్టాలి... అన్న రాచకొండ విశ్వనాథ శాస్త్రిగారి మాటల్ని శిరోధార్యంగా భావించి కలాలు కదుపుతున్న యువతీయువకులు ఎంతోమంది వున్నారు. అభ్యుదయం వారి ఆలోచన. నిలబడలేని వారిని నిలదొక్కుకునెలా చెయ్యడమే వారి నిబద్ధత. ఈ రకం రచయితలు ఆంధ్రదేశంలోను, తెలుగు సాహిత్యంలోను కాదు, భారతీయ భాషలలోను, భారతీయ సాహిత్యంలోను భారతదేశంలో ఎంతో మంది వున్నారు. యువతరం రచయితల్ని కొంచెంసేపు ప్రక్కనుంచితే, వారి ముందుతరం వారిలోను వేళ్ళతో లెక్కపెట్టగలవారైన కొందరున్నారు. అలా వేళ్ళతో లెక్కపెట్టగల బహుకొద్ది మందిలో కత్తిలాంటి కలాన్ని హలంగ చేతబూని సాహితీ వ్యవసాయం సాగిస్తున్నవారు ప్రముఖ బెంగాలి రచయిత్రి మహాశ్వేతా దేవి ఒకరు. ఆదివాసి, హరిజన, గిరిజన, అట్టడుగు వర్గాలకోసం, వారి అభ్యున్నతి కోసం వారి కత్తిలాంటి కలాన్ని ఆయుధంగా స్వీకరించారు మహాశ్వేతాదేవి. బెంగాల్, బీహారు, ఒరిస్సా రాష్ట్రాలలోని ముండా, ఖేడియా, శబర్, లోథ, సంథాల్ మొదలైన గిరిజనులకు మహాశ్వేతా దేవి 'మారాందాయి'. అంటే... పెద్దక్క. మాయీ.. అంటె అమ్మ!

దశాబ్దాల తరబడి గిరిజనులు ఈ సమాజంలో రకరకాల వత్తిళ్ళకు గురవుతున్నారు. గిరిజనులు అనుభవించే కష్టాలు, నష్టాలు, రాక్షసకృత్యాలు, అన్యాయాలను ప్రతిఘటిస్తూ అనేపథ్యంలో మహాశ్వేతా దేవి ఎన్నో కథలు, నవలలు, నాటకాలు వ్యాసాలు రాసారు. గిరిజనుల జీవిత

---

★ **కె. మధుసూదన్**, విశాఖపట్టణం ఆకాశవాణిలో పనిచేస్తున్నారు.

విధానాలను, వారు ఎదురవుంటున్న సమస్యలను కూలంకుషంగ పరిశీలించిన మహాశ్వేతా దేవి, 'భారత దేశంలోని గ్రామాలు శ్మశాన వాటికలుగ భాసిస్తున్నాయి. ! అని విలవిలలాడిపోతారు. అంతేకాదు - గిరిజనుల పట్ల మన ప్రభుత్వాలు చూపించె ఆదరణను గురించి, ప్రపంచ దేశాలు అందించె ఉదార విరాళాలను గురించి అంటారు 'మనం అభివృద్ధికోసం రూపొందించిన బహుళార్థక సాధక ప్రాజెక్టులు చేసే మొట్టమొదటి పని ఆదివాసులను నిరాశ్రయులను చెయ్యడం. వాళ్ళకు ప్రభుత్వం ఏ పునరావాసం కల్పించదు. ప్రపంచంలోని అన్ని ధనిక దేశాలు వాళ్ళు ఉదార విరాళాల్ని యిలాంటి ప్రాజెక్టులలో గుప్పిస్తున్నారు. ఆదివాసులు వారి సొంత గడ్డపైన ప్రవాసులుగ మిగిలిపోతున్నారు ధనిక దేశాలకు అవసరం లేని అనవసరమైన చెత్త చెదారాన్నంత భద్రంగా దాచే అందమైన చెత్తబుట్టలా తయారైంది భారతదేశం' అని.

మహాశ్వేతా దేవి నలభైరెండు నవలలు రచించారు. ఝాన్సీ పరిసర ప్రాంతాలను విస్తృతంగా పర్యటించి, చరిత్రను, అక్కడ ప్రచారంలోనున్న కథలను సేకరించి పరిశీలించి 'ఝాన్సీరాణి' జీవిత చరిత్రను రాసారు. 1895-1900 ప్రాంతాలలో రాంచీ ప్రాంతంలోని అడవులలో నివసించె 'ముండా' గిరిజనుల తిరుగుబాట్లకు నాయకత్వం వహించిన బిర్సముండా జీవితాన్ని ఆదర్శంగా తీసుకుని 'అరణ్యేర్ అధికార్' నవలను వ్రాసారు ఈ నవల ముండా, ఒరంవ్, ఖేడియా శబర్, లోధశబర్, సంథాల్ వంటి గిరిజన భాషలలోకి గిరిజనులు అనువాదం చేసుకున్నారు. ' ఎవరిదీ అడవి!?' అన్న పేరుతో యీ నవల తెలుగులోకి అచ్చయింది. 1979 సంవత్సరం 'అరణ్యేర్ అధికార్' నవలకు సాహిత్య అకాడమి బహుమతి లభించింది. ' ఒకతల్లి కథ, రాకాసి కోవ, దెయ్యాలున్నాయి జాగ్రత్త, ఎవరిదీ అడవి' రచనలను హైద్రాబాద్ బుక్‌ట్రస్టు వారు పుస్తక రూపంలో తెచ్చారు. మకరసవర, దీబారీ, ద్రౌపది, విత్తనాలు, దొంగతనం, మొదలైన కథలు, 'కట్టుబానిస' నాటిక తెనుగులోకి అనూదితమైనాయి.

మన మన్యం వీరుడు అల్లూరీ సీతారామరాజును గురించి ఈ విడ బెంగాలిలో 'సూర్యుడి గుండెల్లో గాయం' అన్న కథవ్రాసారు. నవల వ్రాసే ప్రయత్నంలో వున్నారు.

1857 నుంచి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం దగ్గర నుంచి సంథాల్, ముండా మొదలైన గిరిజన పోరాటాలు మొదలు రైతాంగ సాయుధ పోరాటం, నక్సల్‌బరి ఉద్యమం వరకు వీరి రచన వ్యాసాంగ విస్తృతమైంది. అణచివేతకు, దోపిడికి, పీడనకు గురైన అణగారిన ప్రజల పోరాటాలు, ప్రతిఘటనలు వీరి రచనల్లో కథా వస్తువులుగ చోటు సంపాదించుకుంటాయి.

'ద్రౌపది' వీరి కథల్లో చెప్పుకోదగ్గ కథ. భారతం 'ద్రౌపది' పాత్రను తీసుకొని, ఆధునిక భారతంలో జరిగే సంఘటనను కథగ మలచిన కథ 'ద్రౌపది'. ఈ కథలోని నాయకి 'ద్రౌపది'. ఒక ధనికుడ్ని హత్యచేసిన నక్సల్ ఈకథలోని నాయకి ద్రౌపది. ఆడవంతా గాలించి ఆమెను పట్టుకుంటారు పోలీసులు అనేకసార్లు ఆమెశరీరంపై అతి పాశవికంగాదాడి చేస్తారు. చనుమొనలను కత్తిరిస్తారు. మర్నాడు పోలీసు ఆఫీసరు దగ్గరకు తీసుకువెళ్తారు.

నెత్తురోడుతున్న ద్రౌపది పోలీసు అధికారి ముందు నిలబడుతుంది. ఒంటిమీద గుడ్డలు వేసుకోవడానికి నిరాకరిస్తుంది. అంతేకాదు, 'గుడ్డల వలన ఉపయోగం ఏమిటి!? మీరు నా గుడ్డలను వూడదీయగలరు, చీలికలు, పీలికలుగ చేయగలరేగాని మళ్ళీ ఏ ముఖం పెట్టుకుని

నన్ను వస్త్రధారణ చేయించగలరు? మీరా మగవాళ్ళు? నేను చూసి సిగ్గుపడవలసిన మగవాళ్లు యిక్కడ ఎవ్వరూ లేరు. నా వంటి మీద దారప్పోగు కూడ వేయనివ్వను మిమ్మల్ని ఇంకా మీరు నన్ను చేయగలిగిందేముంది. రండి... రండి. .. నా మీద దాడిచెయ్యండి'. అని ఉద్రేకంతో అంటుందామె. ఆమెలోని విప్లవ ఉద్వేగానికి గజగజలాడి పోతడా పోలీసాఫీసరు.

గిరిజనుల జీవితాల మీద సాధికారం సాధించిన రచయిత్రి మహాశ్వేతాదేవి. గిరిజనుల మీద, గిరిజన జీవితాల మీద తమకున్న ప్రేమ, గౌరవం అనన్య సామాన్యమైనవి గిరిజన సంస్కృతి మీద అచంచలమైన విశ్వాసం వుందావిడకు. గిరిజనుల ఆచార వ్యవహారాల దృష్ట్యా మైదాన ప్రాంతాలలో నివసించే వారికంటె కూడ గిరిజనులు నాగరకులనేది ఆవిడ విశ్వాసం. ఎందుకంటే - మనలో పెళ్ళి పేరంటాలప్పుడుండే కట్నాలు, కానుకలు వారిలో లేకపోవడం. అలాగే, గిరిజన సమాజంలోవున్న వితంతు వివాహాలు మొదలైన అనేక అంశాలు మైదాన ప్రాంతాల వారిలో లేకపోవడం వంటి విషయాలతో గిరిజనులను మైదాన ప్రాంతంలో నివసించే వారికంటే కూడా నాగరికులుగా మనముందు నిలబెడతారు మహాశ్వేతాదేవి

గిరిజనుల జీవితాల మీద మహాశ్వేతాదేవికున్న అవగాహన అపారమైనది. ఆమెకున్న అంతర్ దృష్టిచాల విలక్షణమైనది అందుకె ఆమె రచనలలోని వర్ణనలు, శిల్పం ఆమె రచనలను మహాకావ్యాల పక్కన నిలబడేట్టు చేస్తాయి ఇతిహాసాల స్థాయికి చేరుస్తాయి.

మహాశ్వేతాదేవి 1926 సంవత్సరం నవంబరు14 తేదిన యిప్పటి బంగ్లాదేశ్‌లోని ఢాకాలో పుట్టారు. వీరి తల్లి ధరిత్రిదేవి. రచయిత్రి, సంఘసేవకురాలు. తండ్రి మనీష్‌ఘటక్. ఈయన సుప్రసిద్ధ బెంగాలి అభ్యుదయకవి, సాహితీవేత్త. 'వర్తిక' అనే బెంగాలి సాహిత్య త్రైమాసిక పత్రికకు ఈయన వ్యవస్థాపక సంపాదకులు. ఇదే 'వర్తిక' పత్రికను తండ్రి మరణానంతరం మహాశ్వేతాదేవి గ్రామీణ పత్రికగా నిర్వహించారు. ప్రముఖ బెంగాలి న్యూవేవ్ చలన చిత్ర దర్శకులు రుత్విక్ ఘటక్ వీరి పినతండ్రి. పూనా ఫిలిం అండ్ టెలివిజన్ సంస్థకు కొంతకాలం వీరు ప్రిన్సిపాల్‌గా కూడ పనిచేసారు. ఎకనామిక్ అండ్ పొలిటికల్ వీక్లి వ్యవస్థాపక సంపాదకులైన సచిన్ చౌధురి వీరి మేనమామ. వీరి మరో మేనమామ షంకో చౌధురి ప్రసిద్ధ శిల్పి కొంతకాలం 'విదకళ అకాడమి' అధ్యక్షులుగ వున్నారు.

మహాశ్వేతాదేవి వైవాహిక జీవితం సాఫీగా జరగలేదు. ఈవిడకు రెండుసార్లు వివాహం జరిగింది. 1947 ఫిబ్రవరి 10న విజన్‌భట్టాచార్యతో వివాహం జిరిగింది. ఈయన కధారచయిత, నటుడు, నాటక రచయిత. వీరికుమారుడు నవారుణ్ భట్టాచార్య. నవారుణ్ కూడ ప్రసిద్ధకవి. నటుడు. నాటక దర్శకుడిగా పేరు ప్రఖ్యాతలు పొందారు. విజన్ భట్టాచార్యతో 1962 విడాకులు తీసుకున్న మహాశ్వేతాదేవి, సుప్రసిద్ధ బెంగాలి రచయిత అసిత్ గుప్తాను మళ్ళి పెళ్ళి చేసుకుంది. 1976లో వీరిద్దరూ విడిపోయారు.

కలకత్తా విశ్వవిద్యాలయం నుంచి మహాశ్వేతాదేవి బి. ఎ( ఆనర్స్) ఎం ఎ ( ఇంగ్లీషు) డిగ్రీ, పోస్టు గ్రాడ్యుయేట్ డిగ్రీలను పొందారు. భుక్తికోసం అనేక ఉద్యోగాలు చేయవలసి వచ్చింది. రంగులు, సబ్బులు అమ్మారు. పిల్లలకు ట్యూషన్లు చెప్పారు అమెరికాకు కోతులను ఎగుమతిచేసేందుకు టెండర్లు నింపేపనికూడా చేసారు. కొంత కాలం టీచరుగా పనిచేసారు.

1949-50లో పోస్టల్ డిపార్టుమెంటులో హెడ్‌క్లర్క్ ఉద్యోగంలో చేరి, కమ్యూనిస్టుగా ముద్రపడడంతో ఉద్యోగానికి ఉద్వాసన పలకాల్సి వచ్చింది. 1964లో విజయ్‌గడ్ జ్యోతిష్‌రాయ్ కాలేజిలో ఇంగ్లీషు లెక్చరర్‌గా చేరారు. 1982-84 మధ్యకాలంలో 'యుగంధర్' అనె బెంగాలి దిన పత్రికకు ఉద్యోగం చేస్తూనె స్వచ్ఛందంగ ఏమి తీసుకోకుండ కాలేజిలో చదువు చెప్పేవారు. 1984 నుంచి లెక్చరర్‌గా రిటైరయ్యారు.

మహాశ్వేతాదేవి వారి సాహితీ సృజనకు గుర్తింపుగా ఎన్నో బహుమతులను అందుకున్నారు. 1978లో అమృత్ / లీల అవార్డు, శరత్‌చంద్ర స్మారక రజిత పతకం, 1983లో భువన్‌మోహిని పతకం, 1989లో జగద్తరిణి స్వర్ణపతకం, 1967లో అమృతబజార్ పతకం, 1979లో కేంద్ర సాహిత్య అకాడమి బహుమతి, 1981లో నిఖిల భారత వంగసాహిత్య సమ్మేళన స్వర్ణపతకం, 1977లో తరశంకర స్మారక అవార్డు, 1993లో దినేశ్‌చంద్ర సేన్‌స్మారక స్వర్ణపతకం, 1990లో విభారి భూషణ స్మృతి సంపత్ అవార్డులభించాయి

గిరిజనులకు వీరు అందించిన సేవలకు గుర్తింపుగా 1986 సంవత్సరం పద్మశ్రీ బిరుదునందుకున్నారు. వీరి సాహితి సృజనకు గుర్తింపుగా 1996 సంవత్సరానికి జ్ఞానపీఠ బహుమతి లభించింది. జర్నలిజం, సాహిత్యం, సృజనాత్మక కళలు సమాజసేవ, అంతర్జాతీయ అవగాహన పెంచడం వంటి రంగాలలో విశిష్టసేవలను అందించే వారికిచ్చే మేగసేసె అవార్డు ఈ ఏడాది మహాశ్వేతాదేవికి లభించింది. గిరిజనులకు అందించిన అత్యున్నత సేవలకు గుర్తింపుగా మహాశ్వేతాదేవికి 1997 సంవత్సరానికిగాను మేగసేసె అవార్డు లభించింది.

ఎన్నెన్నో సంఘాలు, సంస్థలతో మహాశ్వేతాదేవికి సంబంధాలున్నాయి. ఆయా సంఘాలకు, సంస్థలకు వీరి సహాయ, సహకారాలు అందుతువుంటాయి.

మహాశ్వేతాదేవి గిరిజనులపాలిట నిజంగా మాయీ (అమ్మ), మారాందాయీనే! ఏడు దశాబ్దాల వయస్సుదాటుతున్నా.... యిప్పటికి చురుకుగా అనేక కార్యక్రమాలలో పాల్గొంటూనే వున్నారు. ఊరంతా తిరిగి పాత గుడ్డలను సేకరిస్తారు. వాటిని గిరిజనులకు ఉపయోగపడేలా చూసి వాటిని వారికి అందజేస్తారు. మనం వాడడం మానేసిన కళ్ళజోళ్ళ ఫ్రేములను సేకరిస్తారు. గిరిజనులకు వాటిని అందుబాటులోకి తెస్తారు. లైన్సుక్లబ్, రోటరీక్లబ్ వంటి సంస్థలు, స్వచ్ఛంద సంస్థల ద్వార గిరిజనులకు వైద్య, ఆరోగ్య శిబిరాలను ఏర్పాటు చేయిస్తారు. వారి శరీర ఆరోగ్యాన్ని తనిఖీ చేయించి గిరిజనులు ఆరోగ్యవంతంగా వుండేల చూస్తుంటారు.

ఇప్పుడు, జ్ఞాన పీఠ బహుమతి, మేగసేసె అవార్డుల వలన వచ్చిన సొమ్మునే రెండు వందల గిరిజన గ్రామాలకు మంచినీటిని సరఫరా చేసే రిజర్వాయిరును నిర్మించే పనిలో ముమ్మరంగా నిమగ్నమై వున్నారు.

ఇంక, యిలానె మాయీ, మారాందాయీ మహాశ్వేతాదేవి సేవలు పదికాలాలపాటు గిరిజనులకు అందుబాటులోకి రావాలని కోరుకుందాం. గిరిజనుల సేవలో మహాశ్వేతాదేవి జీవితం ధన్యం కావాలని ఆకాంక్షిద్దాం.

# డయానా మరణమృదంగం - మృత్యువు వాంఛల మిశ్రమమా?

(సైకో ఎనాలిసిస్) - మిసిమి వర్క్‌షాప్

కడుపులో దేవినట్లు కలంతపెట్టే అపూర్వగాథ ఈ కథ పేదరాసి పెద్దమ్మకథ కాదు. ఒకరకంగా రాకుమారి డయానా కథ పేదరాసి పెద్దమ్మ కథలానే మొదలైంది.

ఆ మధ్య జె. జి. బలార్డ్ నవల ''క్రాష్'' (Crash)ని డేవిడ్ క్రోనెన్ బెర్గ్ సినిమాతీశాడు. ఆ సినిమాని చూసి బ్రిటన్ గగ్గోలెత్తింది. అదొక చీకటి సంఘటన దానిలో బలార్డ్, క్రోనెన్ బర్గ్‌లు అన్వేషించిన భావాలను, విషయాలను చూసిన బ్రిటన్ వాస్తవ్యులు వాటిని అశ్లీలాలని గోలపెట్టారు. కాని అవే అశ్లీల విషయాలను రాకుమారి డయానా, దోడి ఫెయిాద్, నిషాలో ఉన్న డ్రైవరులు చనిపోయిన కారుప్రమాదం సంఘటన చాల దారుణంగా ప్రదర్శించింది.

మనం ఒక విచిత్రమైన సంస్కృతిలో జీవిస్తున్నాం. ఈ సంస్కృతి ప్రకటనల ద్వారా ప్రతి సాంకేతిక యాంత్రిక వస్తువును ''కామరసం'' పొంగి పొరలేట్టు ప్రదర్శిస్తుంది. మనం నిత్యం టి. వి. లో చూసే ప్రకటనలు అర్ధనగ్న సుందర స్త్రీల తొడలతో సబ్బులను, టి. వి లను జోడించి చూపిస్తాయి. ఈ అవస్థ కార్లకూ తప్పలేదు.

అంతేకాదు. మనం 'కీర్తి కండూతి' యుగంలో ఉన్నాం. కీర్తి కెక్కిన సినీ తారలను, రచయితలను, రాజకీయనాయకులను, శాస్త్రవేత్తలను, ఇంకా ఇతర రంగాలలో ఉన్నతస్థాయికి చేరిన వారిని, అందంగా ఉండి అందలం ఎక్కిన వారిని కళ్ళనిండా నింపుకోవాలని ఆక్రోశిస్తాం. అనిమేషంగా మనం దృష్టిని వారిపై నిలుపుతాం. పత్రికలలో, పుస్తకాలలో, టి వి. లో వారి ఫోటోలను కన్నార్పకుండ గంటల తరబడిచూస్తాం. అలా చూడడానికి అలవాటుపడ్డాం. అలా చూడడంలో కామతృప్తిని పొందుతున్నాం. అంటే ''దర్శన లాలస'' పెరిగింది. ఈ దర్శన లాలస ఎంతవరకు పెరిగిదంటే, మనం ఇంకా ఇంకా చూడాలని ఆరాటపడే ఆ ''యశస్వి''ని (Celebrity) ఉక్కిరి బిక్కిరి చేసే వరకు, ప్రాణం తీసేవరకు; అంటే ఆ ''యశస్వు''ల మీద పడిన మన చూపు వారిని వినిమయ వస్తువులుగా వ్యాపారవస్తువులుగా మార్చి వేసింది. వారు అమ్మకానికి దొరికే వస్తువులు అయ్యారు. ఆ అమ్మకంలో లాభం ఉంది. ఆ లాభం కోసం వారి ప్రాణాలు పోయినా, వారిని వెంటాడడం మానరు టి. వి ల వారు, పత్రికలవారు.

బలార్డ్ నవల ఈరెండు కామవస్తువులను - మోటారు కారు, తార - ఒక మహాప్రచండ లైంగిక చర్య (కారు ప్రమాదసంఘటన)లో ప్రదర్శించింది ఇది ఒక దిగ్భ్రాంతి గొలిపే అశ్లీల సంఘటనగా సృష్టింపబడింది ఆ సినిమాలో.

డయానా మరణం కూడా కేవలం అటువంటి ఒక అశ్లీలతే. ఆమె మరణం ప్రపంచ దుఃఖం కావడానికి ఉన్న కారణాలలో ఒకటి, ఆమె చనిపోవడంలో అర్థం లేదు. ఎలాగంటే ఫొటో తీసుకొంటానంటే, వద్దని తప్పించుకోబోయి చనిపోవడం. కాని ఈ భయానక అర్ధరహిత ప్రమాదంలో మనం ''అర్థాన్ని'' చూడవచ్చు. ఇవ్వాళ మనుషులు ఎలా తయారయ్యారనే అప్రియ సత్యాన్ని, నగ్నసత్యాన్ని ఆ సంఘటన తెలియచెబుతుంది.

మన కాముక ఊహలలో కారుతోపోటీ పడగలగింది మరొకటి ఉంది. అది కెమెరా. కెమెరా, విలేకరిలా వార్తలను ''పట్టుకొని'' మన వాకిట ముందుకు తెస్తుంది. కాని అప్పుడప్పుడది,

అందమైన ఆడవాళ్ళను ఆరాధిస్తుంది దాని ''చూపు'' అందమైన ఆడవాళ్ళమీద ''పడుతుంది''. ఆ ''ఆడవాళ్ళ''ను మన ''ఆనందం'' కోసం మన ''దర్శనలాలస''ను ''సంతృప్తం'' చేయడం కోసం, వస్తువులుగ అందిస్తుంది.

డయానా కారు ప్రమాదంలో ''కెమెరా'' విలేకరిగాను, ప్రియునిగాను - రెండూ అదే - పనిచేసింది. "crash"లో ''కారు'', ''తార'' రెండు మాత్రమే ఉంటే, ఇక్కడ ఈ ప్రమాదంలో ఆరెండింటికి తోడుగా కెమెరా సంయోగించబడింది. ఈ సంఘటనలో ''వాంఛ'' ''మృత్యువు''ల మిశ్రమం, బలార్డ్ నవలలోని ''క్రాష్'' కంటె, అత్యంత శక్తిమంతంగా దర్శనమిచ్చింది.

దీన్ని మనం ఇలా చూడవచ్చు వాంఛిత వస్తువు అంటే సౌందర్యరాశి అయిన డయానా, ఇష్టం కాని వరుని (కెమెరా) బారిన పడ్డది ఈ వరుని చూపులు ఆమెను విడవకుండా వెంటాడాయి. మైమరిపించే సాహసవీరుడు (మోటారు కారును నడుపుతూ) కొసకంట ఈడ్చుకుపోయాడు. కెమెరా, ముందుకు పొడుచుకువచ్చిన శిశ్న రూప నాసికతో, ఆమె వెంటబడి తరిమింది. కథ విషాద పూరిత పతాక సన్నివేశాన్ని చేరింది. ఎందుకంటే కారునడిపిన వాడు నాయకుడు కాక ఒక పచ్చి త్రాగుబోతు మీరు పేదరాసి పెద్దమ్మ కథల నాయకులను నమ్మాల్సినపని లేదు వాంఛిత వస్తువు (డయానా), తన మరణసమయంలో, కెమెరా శిశ్నదర్పణం మీది మీదికి వచ్చి ఎడతెగకుండ ఛాయా గ్రహణం చేయడాన్ని చూసింది. ఇలా చూస్తే డయానా మృత్యునగ్నత్వం కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది ఉదాత్తీకృత లైంగిక దాడి (Sublimated sexual assault)లో ఆమె మృత్యువాత పడింది.

ఉదాత్తీకృత మృత్యువు. అసలు సంగతి అది. కెమెరాను కెమెరాగా చూస్తే వాస్తవానికి అది వరుడు కావడానికి వీలు లేదు. ఒకటి నిజం. అది ఆ అందాలరాశిని బంధించాలని ఆశిస్తుంది. ధనలాభం కోసం ఆమెను ఫిల్మ్‌మీద నిలపాలనుకొంటుంది. ఇలా చెప్పడం అంటే చాల సున్నితంగా మృదువుగా చెప్పడం. అసలు పచ్చినిజం ఏమిటంటే కెమెరా మన తరపున పనిచేస్తుంది. కెమెరా ఆ అందాల రాశి మీద దర్శనలాలస (Voyeurism)తో మన తరపున పనిచేస్తుందంటే, అది ఆ అందాల రాశిమీద మనకున్న దర్శన లాలసను వ్యక్తం చేస్తుంది. ఫొటోగ్రాఫర్ల, వార్తాప్రపంచ ఫొటో సంపాదకుల చేతులకు రక్తం అయిందంటే, ఆ రక్తం మన చేతులకు అంటినట్లే. ఏ వార్తా పత్రికలు మనం చదివినా, అవి చదివేటప్పుడు, డయానా దొడితో కలసి సర్దాగా గంతులు వేస్తూ సయ్యాటలాడుతున్నప్పుడు తీసిన ఫొటో మన కంటపడితే, ''అది మాకు సంబంధించింది కాదు'' అని వదిలేసి పక్క పేజీకి వెళ్ళిపోతామా?

మనం మహాదారుణ దర్శన లాలసులం (Voyeurs). ఫొటోగ్రాఫర్స్‌ను చూసి బ్రిటన్‌లో జనం '' ఇప్పుడు మీ కళ్ళు చల్లబడ్డాయా? మీకు సంతృప్తిగా ఉందా?'' అని ప్రశ్నించారు. అదే ప్రశ్నకు మనం, పత్రికా పాఠకులం, ఏం సమాధానం చెబుతాం? మరి మనం ఇప్పుడు అటువంటి దృశ్యాలపై మరులుగొనడం మాని వేస్తామా? డయానా ''అక్రమ చుంబన దృశ్యం'', అంతకుముందరి చార్లెస్ రాకుమారుడు ''నగ్నంగా ఫెర్జీకాలివ్రేళ్ళను చూషిస్తున్న దృశ్యం'' - (ఇవన్నీ పెద్దవాళ్ళ ప్రైవేటు జీవితాల నుంచి దొంగతనంగా తీసిన ఫొటోలు) - లాంటి దృశ్యాలు ఒక దశాబ్దంపైగా, మన వార్తాపత్రికలను నింపడం లేదా? మనం కీర్తిలో బంధించిన గొప్పవాళ్ళ ఆంతరంగిక సంయోగాలను, వారు ఏమరిపాటుగా నగ్నంగా ఉన్నప్పుడు తీసిన దృశ్యాలను చాటుగా చూడడం, వినడం మానివేస్తామా? అలా చేయం.

డయానా తెలివైంది. తన ప్రతిమ (చిత్రం) ఎలా ఉంటే ప్రజలు చూడడానికి ఉవ్విళ్ళు ఊరతారో ఆమెకు బాగా తెలుసు. ఒకసారి ఆమె ఏమి చేసిందో తెలుసా? ప్రపంచంలోకే అత్యంత ప్రసిద్ధమైన ప్రేమ ప్రతీక తాజమహల్ ముందు, ఏకాంతంగా, విరాగంతో, ప్రేమ పరిత్యక్తగా, ఒక ఫొటోను కావాలని తీయించుకొంది. ఈ ఫొటోను ప్రజలు ఎలా ''అర్థం'' చేసుకొంటారో ఆమెకు బాగా తెలుసు. తన మీద సానుభూతి వర్షం కురుస్తుందని, భర్తమీద ప్రజలకు జుగుప్స కలుగుతుందని ఆమెకు తెలుసు ఆమెకు సంకేతాల భాష బాగా తెలుసు. ఏ సంకేతాలు పంపితే ప్రజలు ఎలా స్పందిస్తారో ఆమెకు తెలుసు అందుకని ఆమె, తనను ప్రజలు ఏవిధంగా అర్థం చేసుకోవాలని కోరుకొందో ఆ విధంగా నమ్మకంతో సంకేతాలను పంపింది ప్రజలు అలాగే అర్థం చేసుకొన్నారు ఆమె మరణంలో పాత్రికేయుల, ఫొటోగ్రాఫర్ల పాత్రను చర్చించేటప్పుడు, తప్పకుండ ఆమెకు పత్రికా మాధ్యంతోను, ఫొటోగ్రాఫర్లతోను ఉన్న ''రహస్య ఒప్పందాన్ని'' గుర్తుంచుకొంటే వారి బాధ్యత చాల తగ్గుతుందని కొంతమంది అంటారు బహుశా అంతే కావచ్చు కాని అంతటి స్థానంలో ఉన్న ఒక భద్రమహిళకు తన ''బహిరంగ ప్రతిమ'' (Public image) ను జాగ్రతగా అదుపు చేసుకోవలసిన ఆవశ్యకత ఉందని మనం గుర్తించాలి. వాళ్ళు ఫొటోకు సిద్ధంగా ఉన్నప్పుడు ఫొటో తీసుకుంటే వాళ్ళకు సంతోషంగానే ఉంటుంది కాని వాళ్ళు ఏ మరి పాటున ఉన్నప్పుడు ఫొటోలు తీయడానికే పేపరు వాళ్ళు ఇష్టపడతారు. యుద్ధం జరిగేది నియంత్రణకోసం, ఒకరకమైన ఆధిపత్యం కోసం.

ఆమె వాళ్ళకు తనపై ఆధిపత్యం ఇవ్వడానికి ఇష్టపడదు కేవలం వారికి కర్మ (object) కావడం ఆమెకు సుతారమూ ఇష్టం లేదు వెంటపడే కెమెరా దర్పణాలనుంచి దూరంగా పారిపోవడం ద్వారా ఆమె తన ఉద్దేశ్యాన్ని తెలియచేస్తుంది. తాను కేవలం ఒక కర్మకాదు, తానొకకర్తను అని నిరూపించుకోవాలనేది ఆనిర్ణయం. ఇలా కర్మ నుంచి కర్తగా మారడానికి, వినిమయవస్తువునుంచి మానవతకు మారడానికి తీసిన పరుగులో ఆమె మృత్యువాత పడింది తన జీవితానికి తానే రాణి కావాలని కోరి, ఒక కారును సరిగా నడపలేని చోదకుని చేతిలో పడింది ఇది గూడ ఒక చేదువిశ్లేషే.

ఈ భ్రమల ముసుగుల వెనుక, ప్రతిమల సంఘూత విఘూతాల వెనుక, ఈ గందరగోళమోసాల వెనుక ''ముగ్గురి మరణం'' అనే ఒక వాస్తవిక సంఘటన ఉంది. అందులో ఒకరు మంచితల్లి. తన పిల్లలకు వాస్తవ ప్రపంచాన్ని చూపాలనుకొంది. అలాగే రాజప్రాసాదంలో లభించని అనేక వాస్తవ దృశ్యాలను - సంతలను, క్లబ్‌లను తన పిల్లలకు చూపించింది. మన అసంతృప్త డయానా దర్శనలాలస ఆమె మరణానికి కారణం అని మనం అంతా ఒప్పుకొంటే, పాపం ఆమె పిల్లలు ముందు ముందు ఎలా ఈ ప్రపంచంలో - ఆమె చూపించదలచుకొన్న వాస్తవ ప్రపంచంలో, బ్రిటీషు రాచరిక ఇరుకు సమాజానికి ఆవలి ప్రపంచంలో, ఇటన్ కాలేజీకి వెలుపల ప్రపంచంలో - ఎలా బ్రతుకువెళ్ళదీస్తారోగదా! వారిని హారిసన్ ఫోర్డ్ సినిమాలకు ఎవరు తీసుకువెళ్తారు? ఎయిడ్స్ రోగుల దగ్గరకు ఎవరు తీసుకువెళ్తారు? ఎల్గాగైనా ఏనాటికైనా వారు సుఖంగా ఉండగలరా? - అనే ప్రశ్నలు వేసుకోవాలి.

డయానా రాచకుటుంబం నుంచి బయటపడినప్పుడు ఎంతో హాయిగా ఉంది. ఒకసారి అది రాజుల, రాణుల నుంచి బయటపడితే బహుశా బ్రిటన్ గూడ అదే హాయిని అనుభవించవచ్చు.

(దిన్యూయార్కర్ సెప్టెంబరు 15, 1997 సంచికలోని సాల్మన్ రష్డీ వ్యాసం ఆధారంగా. ఈ వ్యాసాన్ని మనోవిశ్లేషణ పరంగా అర్థంచేసుకోవాలి. కొటేషన్స్‌లోని పదాలను జాగ్రత్తగా గమనించాలి - సంపాదకుడు)

# పిల్లల్లో అహంకేంద్రక ప్రవర్తన

– 'కిట్టు'

సుజాతకు అబ్బురాన పుట్టిన ముద్దులబిడ్డ శంకరం. శంకరం ఎక్కువుగా వాడిలోకంలో వాడు బ్రతుకుతున్నట్టు ఉండేవాడు చుట్టు పక్కల వాళ్ళని అసలు పట్టించుకోడు. మిగిలిన పిల్లలు అందరూ కలిసి ఆడుకుంటున్నా శంకరం ఒక్కడే ఆడుకునేవాడు. పిల్లల మధ్యలో వాడిని ఒదిలేసినా కూడా వాళ్ళతో ఆడుకోకుండా ఏవో బొమ్మలను పెట్టుకొని ఒంటరిగా ఆడుకునేవాడు. వాడికి మాటలు కూడా చాలా ఆలస్యంగా వచ్చాయి. మాటలు వచ్చినాకూడా ఒకే మాటను అరిగిపోయిన గ్రాంఫోన్ రికార్డులాగా తిరిగి తిరిగి అనటం. చేసిన పనినే మళ్ళి అదేపనిగా చేసుకుంటూ పాయేవాడు. వాడు మన ధ్యాసలో ఉండక ఒకోసారి పిలిచినాకూడా పలికేవాడు కాడు. కానీ శంకరం బొమ్మలు బాగా గీసేవాడు. ఇవన్నీ చూసి సుజాత శంకరం చాలా గొప్పవాడవుతాడని, అందుకే ఎప్పుడూ ఏదో ఆలోచనలో ఉంటాడని అనుకుంది. రాజారావుకు మాత్రం తేడా కనిపించింది స్కూల్లో చేర్పిస్తే మిగిలిన పిల్లలతో ఆడుకోవటం వలన మార్పువస్తుందనుకొని స్కూల్లో చేర్పించాడు. కానీ అక్కడకూడా పరిస్థితి అలాగే ఉంది. పిల్లలతో ఆడుకోవటం మాట అటుంచి చదువులో కూడా చాలా వెనకబడ్డాడు. శంకరం టీచర్లు కూడా రాజారావుకు శంకరం గురించి రెండు మూడుసార్లు చెప్పారు అప్పటికి సుజాతకు శంకరం పరిస్థితి అర్థమయింది. వాడి మానసిక ఎదుగుదలలో ఏదో లోపం ఉన్నట్టనిపించేది. చురుకుగా ఆడుతూ పాడుతూ ఉండవలసిన పిల్లవాడు నిర్లిప్తంగా ఉండటం చూసి సుజాతకు గుండె చెరువయ్యేది. రాజారావు శంకరాన్ని ఫ్యామిలి డ్యాక్టరుకు చూపిస్తే మానసిక వైద్యుణ్ణి సంప్రతించమని సలహా ఇచ్చాడు.

ఎన్నో ఆశలతో రఘును కన్నాం, కానీ రఘుతో పెద్ద సమస్య వచ్చి పడింది. నిన్న చెప్పింది ఇవాళ్ళ మరిచి పోయేవాడు. వాడికి బాగా జ్ఞాపకం ఉండేటట్టు చేద్దామని ఒకటికి రెండుసార్లు చదివించేదుకు ప్రయత్నిస్తే కుదురుగా చదివే వాడు కాదు. పోనీ చిన్నపిల్లాడు ఆటల మీద మోజుతో చదువుమీద ఆసక్తి చూపించటం లేదనుకుంటే పరిస్థితి ఇంకా దిగజారింది. మతిమరపు ఇంకా ఎక్కువయ్యింది. పరీక్షల్లో మార్కులు చాలా ఘోరంగా వచ్చాయి. పట్టుమని పదినిముషాలు కూడా కుదురుగా ఉండే వాడు కాదు. 24 గంటలూ గెంతడమూ పరిగెత్తడమో చేసేవాడు. వసపిట్టలాగా ఎప్పుడూ ఏదో వాగుతూ ఉండే వాడు. వాడితో Home Work చేయించడం కూడా కష్టమయిపోయేది. స్కూల్లో కూడా ఎప్పుడూ పక్కవాళ్ళని గిచ్చుడం, అల్లరి చేయటం దెబ్బలు తినటం పరిపాటి అయిపోయింది. వాడికి కొద్దిగా వయసు పెరిగినా నిలకడ కుదరలేదు. ఏదైనా పనిని మొదలు పెడితే ఎంతవరకు చేస్తాడో నమ్మకంలేదు. పనిని సగంలో వదిలేసి వేరే పనికి వెల్తాడు. రమ్య రకరకాలుగా ప్రయత్నించింది బుజ్జగించింది, భయపెట్టింది. చివరకు ఓపిక నశించి వాడిని కొట్టడం మొదలు పెట్టింది. ఇది సమస్యను ఇంకా తీవ్రంచేసింది. స్నేహితుడి సలహామీద కృష్ణమూర్తి రఘుని మానసిక వైద్యుని దగ్గరకు తీసుకు వెళ్ళాడు.

శంకరం, రఘు వంటి వాళ్ళను మనం అక్కడక్కడా చూస్తు ఉంటాం. మానసిక నిపుణుల

---

★ **పి.బి.కె. ప్రసాద్,** దక్షిణ మధ్యరైల్వేలో పనిచేస్తున్నారు.

పరిభాషలో ఈ రకమైన ప్రవర్తనలను Autism, Attention deficit disorder ( ఏకాగ్రతాలోపం) అంటారు వాటి గురించి మనం కొద్దిగా తెలుసుకుందాం

## Autism : అహం కేంద్రకత్వం

సమాజంతో కలవకుండా ఒక ఊహాప్రపంచాన్ని నిర్మించుకొని అందులోనే బ్రతికేవారి ప్రవర్తనను Autism అంటారు. ఇది బాల్యంలో వచ్చే ఒక మానసికవ్యాధి. వీరు భావ ప్రసారం చేయడానికి అశక్తులు. ఇతరులతో సంబంధాలు పెట్టుకోలేరు. ఇలాంటి వారు సంఖ్యలో చాలా తక్కువగా ఉంటారు. సుమమారు ప్రతి 10,000 మందికి ఒకరుంటారు. ఇలాంటి పిల్లల గురించి ఒక అపోహ ప్రచారంలో ఉంది. వాళ్ళ చుట్టూ కనిపించని పారదర్శకమైన గోడలాంటిది ఉంటుందని. ఏ దేవుడయినా కనికరించి ఆ గోడను బద్దలుకొడితే కానీ ఇలాంటి వారికి మోక్షముండదని. అప్పటి వరకు వాళ్ళు సమాజంలో కలవకుండా ఒంటరిగా బ్రతుకుతారని నమ్మకం ఉంది.

ఈ రకమైన ప్రవర్తనను గుర్తించి శాస్త్రీయ పరిశోధన చేసినవాడు డ్యాక్టర్ E. Leo Kanner. ఈయన పరిశోధనలు వెలుగులోకి వచ్చిన తరువాత చాలామంది ఈ రకమైన ప్రవర్తనను పిల్లల్లో గుర్తించటం జరిగింది. ఈ లక్షణాలు కనిపించిన పిల్లలు పెద్దయిన తరువాత కూడా పెద్దగా మారరు.

డ్యాక్టర్ Kanner మొట్టమొదటి సారిగా డోనాల్డు (Dunald) అనే వ్యక్తిలో ఈ రకమైన ప్రవర్తనను గమనించాడు. రెండు సంవత్సరాల వయస్సు వరకు డోనాల్డ్ ప్రవర్తనలో అసాధారణత ఏమీ లేదు. పద్యాలను చక్కగా అప్పచెప్పేవాడు 100 వరకు అంకెలను ముందునుంచి వెనకకి వెనకనుండి ముందుకు కూడా అప్పచెప్పేవాడు. కానీ డోనాల్డ్‌కు ఒక విచిత్రమైన అలవాటుంది. అతను బొమ్మలతో ఆడుకోకుండా వాటిని బొంగరం లాగా తిప్పటం, విసిరివేయటం లేకపోతే రంగులప్రకారం అమర్చటం చేసేవాడు.

ఐదేళ్ళ వయసు వచ్చిన తరువాతకూడా డోనాల్డు చుట్టుపక్కల వాళ్ళను గమనించకుండా తనలోకంలో బ్రతికేవాడు. వాడికి చుట్టుపక్కల ఉండే మనుషులతో సంబంధాలు వాడి అవసరం వరకు మాత్రమే పరిమితమయి ఉండేవి. సాధారణంగా పిల్లలు వారి ఆటలకు ఎవరయినా అడ్డువస్తే పెద్దగా అరవటమో ఏడవటమో చేస్తారు. కానీ డోనాల్డ్ ఏదో వస్తువు అడ్డువచ్చినట్టుగా ఆ వ్యక్తిని పక్కకు జరిపేందుకు ప్రయత్నించేవాడు కాని కోపము వచ్చేదికాదు. వాడికున్న ఒకే ఒక్క స్నేహితురాలు వాడి తల్లి. అది కూడా ఆవిడ 24 గంటలు వాడిని అంటి పెట్టుకొని, వాడితో ఆడుకోవడానికి ప్రయత్నించడం వలన సాధ్యమయింది.

ఇలాంటి పిల్లలకు మాటలు చాలా ఆలస్యంగా వస్తాయి. మాటలు వచ్చినా కానీ చాలా తక్కువుగా ఉపయోగించడం జరుగుతుంది. మాట్లాడినాకానీ మాటలు అర్థవంతంగా ఉండవు ఉదాహరణకి 'నాకు', 'నీకు', అన్నపదాలకి మధ్య తేడా తెలియక 'నాకు బొమ్మ కావలి' అనటానికి బదులు 'నీకు బొమ్మ కావలి' అంటారు. వాళ్ళ అవసరాలను కూడా స్వయంగా చెప్పకుండా పెద్దవాళ్ళ చేతులను కావలసిన వస్తువు దగ్గరకు తీసుకువేళ్ళడం ద్వారా చెబుతారు. అంతేకాకుండా మనం అన్న ప్రతి మాటను చిలకలాగా తిరిగి చెప్పటం లేకపోతే ఒకే మాటను

తిరిగి చెప్పటం చేస్తుంటారు ఉదాహరణకు వాళ్ళమ్మ ''అల్లరి చేయకుండా ఆడుకో'' అన్నదనుకోండి ఇంక రోజంతా ఆ పిల్లాడు అదే మాట అప్పచెప్పుతూ ఉంటాడు

వీళ్ళకు కొంతవయసు వచ్చి సంఘంలో బాధ్యతాయుతమయిన పాత్ర పోషించవలసి వచ్చిన సమయంలో కూడా పెద్ద మార్పుండదు. వీళ్ళల్లో సామర్థ్యమున్న కొంతమంది వ్యక్తులు మటుకు చాలావరకు పరిస్థితులకు అనుకూలంగా వాళ్ళప్రవర్తనను సరిదిద్దుకోగలుగుతారు అయినప్పటికి వీళ్ళకు వ్యక్తులతో సంబంధాలు చాలా పరిమితంగానే ఉంటాయి. మిగిలిన వ్యక్తులతో సంబంధం ఏర్పరుచుకునే సామర్థ్యం ఐదేళ్ళలోపు వీళ్ళు పొందిన భాషాపరమైన, మేధపరమైన నైపుణ్యత మీద ఆధారపడి ఉంటుంది వాళ్ళలో కొంతమంది కొన్ని రంగాలలో మంచి ప్రతిభను చూపించిన వారుకూడా ఉన్నారు. ఉదాహరణకు సంగీతం, చిత్రలేఖనం వంటి రంగాలు

చూసేందుకు ఈ ప్రవర్తన మానసిక కారణాల వలనే వస్తుందనిపిస్తుంది ఎందుకంటే వీరిలో శారీరకంగా కానీ నాడీ పరంగా కాని ఎటువంటి అసాధారణత కనిపించదు చాలాకాలం వరకు మానసిక శాస్త్రవేత్తలు కూడా ఈ విధంగానే భావించారు. మానసిక శాస్త్రవేత్తల ప్రకారం ఈ రకమైన ప్రవర్తనకు ఆధారం కుటుంబ, సమాజ, మానసిక పరిస్థితులలో ఉంది అంటే వ్యక్తులు చిన్నతనంలో తీవ్రమయిన భయాన్ని కలిగించే సంఘటనను ఎదుర్కోవటం కానీ, తల్లి అనుబంధానికి దూరమవ్వటంకాని, ఘోరమైన నిరాదరణకి గురవ్వటం జరిగినప్పుడు వాళ్ళు బాహ్యపరిస్థితులనుండి పారిపోయేందుకు ప్రయత్నిస్తారు ఆ ప్రయత్నంలో తమచుట్టు ఒక ఊహా ప్రపంచాన్ని సృష్టించుకొని బ్రతుకుతారు. అందువలనే వాళ్ళు సమాజానికి దూరంగా ఉంటారు దీనికి మానసిక శాస్త్రవేత్తలు ఇచ్చే నివారణ ఏమిటంటే వాళ్ళకు సరయిన ఆదరణని, ధైర్యాన్ని కల్పించటం దీని గురించి తల్లి తండ్రులకు వాళ్ళు శిక్షణ ఇచ్చేవాళ్ళు.

కానీ ఇలాంటి శిక్షణ వలన ఉపయోగం లేకుండా పోయింది. అది పిల్లల్లో ఏమాత్రం మార్పును తీసుకురాకపోగా, వాళ్ళను జీవితాంతం మోయవలసిన కుదిబండలుగా మార్చింది. అందువలన దీనికి శారీరకమైన మూలమేమైనా ఉన్నదేమోనని తెలుసుకునేందుకు ప్రయత్నించారు. ఎందుకంటే జన్యుపరంగా కొద్దిగా ఆధారం ఉంది. వేరు వేరు అండాల నుండి ఉద్భవించిన కవలలు (Fraternal twins) ల కంటే ఒకే అండం నుండి ఉద్భవించిన కవలలు (Identical twins) లో ఇద్దరికీ ఈ వ్యాధి ఉండే అవకాశం ఎక్కువగా ఉంది. కాకపోతే దానికి ఆధారమైన జన్యువులను ఇంకా గుర్తించలేదు.

అంతే కాకుండా Autism చూపించే పిల్లల మెదడును పరిశీలించినప్పుడు ఆరోగ్యమైన పిల్లల మెదడుకు వీరి మెదడుకు తేడా కనిపించింది. మన మేధాపరమైన ఆలోచనలకు మూలకారణమైన మెదడు ముందు భాగాలు (Frontal lobes) నిర్మాణంలో తేడా వలన Autism వస్తుందని తెలిసింది. Frontal lobes లో ఆరోగ్యవంతమైన మెదడులో ఉండే ముడుతలు కంటే Autismఉన్న వ్యక్తుల మెదడులో తక్కువగా ఉన్నాయి. ఇది ఖచ్చితంగా శారీరక మూలానికి ఆధారం. Frontal lobes ను ఉద్దేశ్యపూరకంగా గాయపరచినప్పుడు కానీ లేక వేరేదేని కారణం వలన దెబ్బతిన్నప్పుడు కానీ, Frontal lobes కు మెదడులోని మిగిలిన భాగాలకు సంబంధం తెగి పోయినప్పుడు కాని ఆ వ్యక్తులు Autism లక్షణాలను ప్రదర్శించారు

ఈ వ్యక్తులు సమాజంతో కలవలేకపోవడానికి కారణం ఊహాత్మక ప్రపంచంలోకి జారిపోవడం కాక అసంపూర్ణంగా ఎదిగిన మెదడు కారణం కావచ్చు. వాళ్ళు తీవ్రమైన ఆలోచనలలో మునిగి పోక ఒక విధమయిన మానసిక నిస్తేజ స్థితిలో ఉండవచ్చు. ఎందుకంటే Autismవ్యక్తుల తెలివితేటలను గమనించినప్పుడు ఈ విషయం స్పష్టమయింది. IQ తక్కువుగా (Oనుండి 19 వరకు) ఉన్న పిల్లల్లో ఎక్కువ భాగం (86శాతం) Autism లక్షణాలను చూపించారు. IQ ఓ మాదిరిగా (20 నుండి 49 వరకు) ఉన్న పిల్లల్లో కొద్దిగా తక్కువుగా (సుమారు 42 శాతం) ఈ రకమైన ప్రవర్తనను కలిగి ఉన్నారు. IQ సాధారణ స్థాయికి దగ్గరగా ఉన్న (So పైన) పిల్లల్లో చాలా తక్కువమంది మాత్రమే Autism ను (2నుండి 0.013 శాతం) ప్రదర్శించారు. దీనిని బట్టి బుద్ధి మాంధ్యతకు Autism కు చాలా దగ్గర సంబంధం ఉంది అని తెలుస్తుంది

కానీ వీరి మెదడు నిర్మాణ లోపంకు ఖచ్చితమైన కారణం తెలియదు. మన మెదడులో జరిగే ఒకగొప్ప ప్రక్రియ వీరిలో లోపించటం వలన ఈ విధంగా జరుగుతుందని Medical Research Council కు చెందిన Dr. Uta Frith అంటున్నారు. ఎందుకంటే ఈ వ్యక్తులలో మూడు రకాల లోపాలు కనిపిస్తాయి. అని భావవ్యక్తీకరణ, సృజనాత్మకత, ఇతరులతో సంబంధం ఏర్పరుచుకోవటం వంటి అంశాలలో లోపం. కానీ ఈ మూడింటికి కారణభూతమైన అంతర్గత ప్రక్రియ ఒకటే. అదే మనలను ఆలోచనల గురించి ఆలోచింపచేస్తుంది. ఇతరుల ప్రవర్తనను ఆలోచనలను అంచనా వేయగలుగుతుంది.

సాధారణంగా 'మనిషి సాంఘిక జీవి. తన అభిప్రాయాలను ఆలోచనలను ఇతరులతో పంచుకోవటంలో ఎంతో ఆనందాన్ని పొందుతాడు. చాలా చిన్నపిల్లల్లో కూడా ఇతరులతో తమ సంతోషాన్ని పంచుకునేందుకు ఆసక్తి కనబరుస్తారు. ఒక సంవత్సరం వయసు కలిగిన పిల్లవాడు కూడా తనకు నచ్చిన వస్తువును పెద్దవాళ్ళకు చూపిస్తాడు. అతనికి ఆ వస్తువు కావాలి అనిపించక పోయినా కేవలం తన సంతోషాన్ని ఇతరులతో పంచుకునేందుకు కూడా ఆ విధంగా చేస్తారు. కానీ Autism లక్షణాలు ఉన్న పిల్లల్లో ఈ విధమయిన ''పంచుకోవటం'' కనిపించదు వాళ్ళు ఒక వస్తువును చూపించారంటే అది వాళ్ళకి అవసరమనుకుంటే మాత్రమే చేస్తారు.

వాళ్ళలో ఉండే ఇంకో లోపమేమిటంటే ఉన్నదాన్ని లేనట్టుగా కానీ లేనిదాన్ని ఉన్నట్టుగా కానీ నటించడం రాదు. చిన్నపిల్లలు ఎక్కువగా బొమ్మను తమ పిల్లాడి కింద చేసి దానికి అన్ని పనులు చేస్తుంటారు. ఉదాహరణకు ఆ బొమ్మకి పాలు పట్టాలనుకొండి ఒకచెంచాను కాని, చెంచాలాంటి వస్తువును కానీ తీసుకొని ఉత్తుత్తి పాలని బొమ్మకు పట్టుతారు. ఇలా చేసేటప్పుడు తల్లి సాధారణంగా పాలు పట్టేటప్పుడు చేసే ప్రతి కదలికను వీరు అనుకరిస్తారు. అంతేకాకుండా పిల్లలు పాలు తాగేటప్పుడు అయ్యే శబ్దాలను కూడా అనుకరిస్తారు. Autism ఉన్న పిల్లలు ఈ విధంగా చేయలేరు. కేవలం చెంచాను బొమ్మ మూతి దగ్గర పెట్టడం, తీయడం మాత్రమే చేస్తారు. అందులో అనుకరణ కంటే యాంత్రికత ఎక్కువగా కనిపిస్తుంది.

వీళ్ళ భావనా శక్తి లోపాన్ని నిర్ధారించేందుకు Dr. Uta Frith బృందం కలిసి ఒక పరిక్షను రూపొందించారు. ఈ పరిక్షను ప్రాథమికంగా రూపొందించిన వాళ్ళు Australia కు చెందిన Henz Wimmer, Joseph Penner. ఈ పరీక్షలో పిల్లలకు ఒక తోలు బొమ్మలాట చూపిస్తారు. ఈ ఆటలో ఇద్దరు పిల్లలు Salley, Anna ఉంటారు. Salley ఒక వస్తువును ఒక

బుట్టలో దాచిపెట్టి బయటకు వెళ్తుంది. Anna ఆ వస్తువును తీసి వేరే పెట్టెలో దాచిపెడుతుంది. కొంతసేపు అయిన తరువాత Salley తిరిగివస్తుంది అందరూ ఊహించినట్టుగానే ఆ వస్తువు గురించి Salley బుట్టలో వెతుకుతుంది. ఈ తోలు బొమ్మలాటను నాలుగేళ్ళ వయసు పై బడ్డ పిల్లలకు చూపించినప్పుడు Salley బుట్టలో వెతుకుతుందని చాలా మంది సరిగ్గా ఊహించారు కానీ Autism లక్షణాలున్న పిల్లలు, 9 ఏళ్ళు వయసు మించిన వారు కూడా Salley పెట్టెలో వెతుకుతుందని చెప్పారు. అంటే పెట్టెలో ఆ వస్తువును పెట్టడం వీళ్ళు చూశారు కాబట్టి Salleyకి కూడా ఆ విషయం తెలుసు అనుకుంటారు Anna ఆ వస్తువును పెట్టెలో పెట్టడాన్ని Salley గమనించనందువలన Salleyకి ఆవిషయం తెలిసే అవకాశం లేదన్న నిజాన్ని వీళ్ళు ఊహించలేరు.

దానిని గురించి వివరిస్తూ Allam M Leslie మన ప్రపంచాన్ని రెండు రకాలుగా విభజించారు ఒకటి వస్తు ప్రపంచం, రెండవది ఊహాప్రపంచం. మనం ఈ రెండు ప్రపంచాలని విడివిడిగా గుర్తిస్తూ, అదే సమయంలో రెండు ప్రపంచాలని అన్వయించడం ద్వారా విషయాలను అర్థంచేసుకుంటాము. పిల్లలలో కూడా ఇదే జరుగుతుంది. ఉదాహరణకు మనం అరటిపండును చెవి దగ్గర పెట్టుకొని ఫోనులో మాట్లాడినట్టు మాట్లాడుతున్నామనుకోండి. మనం అరటి పండును చెవిదగ్గర పెట్టుకొని మాట్లాడటాన్ని పిల్లలు గమనిస్తారు. టెలిఫోన్‌లో మాట్లాడటాన్ని ఊహించుకుంటారు.... అందుకని ఆరోగ్యవంతమైన పిల్లలు మనం ఫోన్‌లో మాట్లాడటాన్ని నటిస్తున్నామని అర్థం చేసుకుంటారు అంతేకానీ అరటి పండును చూసి ఫోన్ అనుకోవడం కానీ ఫోన్‌ను చూసి అరటిపండు అనుకోవటం కానీ చేయరు. వస్తుప్రపంచంలో ఉన్న అరటిపండును, ఊహాప్రపంచంలో ఉన్న టెలిఫోన్‌ను మనం చెవిదగ్గర పట్టుకొని మాట్లాడటం అనే చర్య ద్వారా అన్వయించుకొని మనం టెలిఫోన్ చేస్తున్నట్లు నటిస్తున్నామని అర్థంచేసుకుంటారు. కానీ ఈ ప్రక్రియ Autism ను ప్రదర్శించే పిల్లలలో దెబ్బతింటుంది. వాళ్ళకు ఊహాప్రపంచం, నటించడం లాంటివి ఉండవు. ఒక విషయం నిజమయి ఉండటం, అదే సమయంలో దానికి విరుద్ధమైన ఆలోచనలు వేరే వ్యక్తులలో ఉండటాన్ని వీళ్ళు అర్థం చేసుకోలేరు. అందుకనే నిజానికి నటనకి మధ్య తేడా వాళ్ళకి తెలియదు. వ్యంగ్యాన్ని, మాటల వెనక ఉండే నిగూఢమైన అర్థాన్ని వీళ్ళు తెలుసుకోలేరు అలాగే మిగిలిన మనుషుల నమ్మకాలని, విశ్వాసాలని వీళ్ళు అర్థంచేసుకోరు. ఇతరుల ప్రవర్తనను మనం కొంతవరకు అంచనా వేస్తాం. మిగిలిన వ్యక్తుల ఆలోచనలను ఊహించటం ద్వారా, వాళ్ళ చర్యలను గమనించడం ద్వారా వాళ్ళ ప్రవర్తన గురించి ఒక అవగాహనకు వచ్చి దానికి అనుకూలంగా మనం వాళ్ళతో సంబంధాలను మార్చుకుంటాము. Uta Frith ప్రకారము వీటి అన్నిట్టికి మెదడులో జరిగే ఏకైక అంతర్గత ప్రక్రియ ఆధారము ఈ ప్రక్రియ లోపం వలన Autism వ్యక్తులలో ఇతరుల మనస్తత్వాన్ని అంచనా వేయలేకపోవడం, ద్వంద ప్రవర్తనను అర్థంచేసుకోలేకపోవడం వ్యక్తులతో సంబంధాలు ఏర్పరుచుకోలేకపోవడం జరుగుతుంది.

ఈ ప్రక్రియను గుర్తించినప్పటికి దీనికి కారకమైన మెదడులోని భాగాలని కానీ, నాడీ వ్యవస్థను కానీ రసాయన సంకేతాలని కానీ ఇంకా ఖచ్చితంగా గుర్తించలేదు.

Autism వ్యక్తులు సమాజానికి దూరంగా బ్రతుకుతుంటే, Attention deficit disorder (మనసు నిలపలేకపోవడం, ధారణాలోపం) ఉన్న వ్యక్తుల ప్రవర్తన ఇందుకు భిన్నంగా ఉంటుంది.

**Attention deficit disorder ధారణాలోపం :**

ఈ ధారణా లోపం పిల్లలలో చాలా ఎక్కువగా కనిపిస్తుంది American Psychiartic Association Hand Book వారి సర్వే ప్రకారం ప్రతి పది మందిలో ఒకరు ఈ అసాధారణ ప్రవర్తనతో బాధపడుతూ ఉంటారు.

ఇలాంటి పిల్లలు సాధారణమైన పిల్లలకంటే చాలా ఎక్కువగా చురుకుగా ఉన్నట్టు కనిపిస్తారు. వీళ్ళల్లో కనిపించే అతి ముఖ్యమైన లక్షణం మతిమరుపు ఏ విషయాన్నైనా అతి తొందరగా మరిచిపోతారు. ఒక చోట నిలకడగా ఉండటం కానీ, ఒక దాని మీద మనసు నిలపడం కాని చేయలేరు. వాళ్ళ ఏకాగ్రతను చెదరకొట్టడం చాలా తేలిక. ప్రతిదాని వైపు చాలా తొందరగా ఆకర్షితులవుతారు. అందుకే దేనిని కూడా పూర్తిగా గమనించరు. కంగారు కంగారుగా అటూ ఇటూ తిరగటం, పిల్లలయితే గెంతడం పరిగెత్తడం చేస్తుంటారు మాట్లాడే దాంట్లో అర్థమున్నా లేకపోయినా అదే పనిగా వాగుతూనే ఉంటారు. ఇతరుల పనులలో సంభాషణలలో అసందర్భంగా జోక్యం చేసుకుంటారు. పనులు అర్థంతరంగా వదిలేస్తారు. ఎదురు చూడాలంటే చాలా అసహనం. ఈ రకమైన లక్షణాలు ఆరోగ్యవంతమైన వాళ్ళలో కూడా కనిపిస్తాయి కానీ ధారణా లోపం ఉన్న వాళ్ళలో చాలా ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. దీనిని గుర్తించడం కూడా కొద్దిగా కష్టమే.

**Autism** లాగానే ఏకాగ్రత లోపం కూడా మామూలు ప్రవర్తన లోపం క్రిందే చాలాకాలం భావింపబడింది. ఇది కూడా కుటుంబ సాంఘిక పరిస్థితులు, వ్యక్తిగత సంబంధాల వలన వస్తుందనుకున్నారు. కాలిఫోర్నియాలోని **Irwin Child Development Centre** కు చెందిన **Prof. James M Swansow** ఏకాగ్రతా లోపంతో బాధపడే పిల్లల మెదడులను గమనించినప్పుడు వాళ్ళ మెదడు నిర్మాణంలో లోపం కనిపించింది. మన మెదడులోని ముందుభాగాలు (**Frontal lobes**) మన ఆలోచనలను, జ్ఞానాన్ని ప్రభావితం చేస్తాయి. ఏకాగ్రతా లోపం ఉన్న వ్యక్తులలో ఈ **Frontal lobes** సరిగ్గా అభివృద్ధి చెందలేదు. ఆరోగ్యవంతమైన వ్యక్తులలో కంటే ఏకాగ్రతాలోపం ఉన్న వ్యక్తులలో ఈ భాగాలు సుమారు 10 శాతం వరకు పరిణామం తక్కువగా ఉంది. ఆశ్చర్యం కలిగించే విషయం ఏమిటంటే **Autism** ఉన్న వ్యక్తులలో కూడా మెదడు **Frontal lobes** నిర్మాణంలో తేడా కనిపించిది ( ఆరోగ్యవంతమైన వ్యక్తుల మెదడులోని **Frontal lobes** లో కనిపించే ముడుతల కుంటే **Autism** ఉన్న వ్యక్తులలోని **Frontal lobes** లో ముడుతలు తక్కువగా కనిపించాయి). **Autism, Attention deficit disorder** చూసేందుకు భిన్నంగా కనిపించినా రెండు కూడా శారీరక కారణాల వల్లనే ఏర్పడుతున్నాయి. అదికూడా మెదడులోని ఒకే భాగంలోని విభిన్నమైన లోపాలు ఈ అసాధారణ ప్రవర్తనలకు కారకమవుతున్నాయి.

ఏకాగ్రత లోపం ఉన్న వ్యక్తులలో మెదడులోని భాగాల పరిణామం తక్కువగా ఉండటానికి కారణం ఇంకా స్పష్టంగా తెలియకపోయినప్పటికి దానికి కారకమైన రెండు జన్యువులను గుర్తించారు. మెదడు నిర్మాణానికి, అభివృద్ధికి చాలా అవసరమయిన **Dopamine** అనబడే **Neuro transmitter** ఉత్పత్తిని ఈ జన్యువులు ప్రభావితం చేస్తాయి. ఈ జన్యువులలో ఏర్పడిన లోపం శిశువు పిండదశలో ఉన్నప్పుడే ప్రభావం చూపి **Frontal lobes** సరిగ్గా అభివృద్ధి కాకుండా చేస్తాయి. అందువలనే వీటిపరిమాణం వీరిలో తక్కువగా ఉంటుంది.

**James, The Lancent** లో రాసిన పరిశోధనావ్యాసం ప్రకారం దానికి కారణం కొంతవరకు గుర్తించబడినప్పటికి నివారణ ఖచ్చితంగా లేదు. **Stimulant drugs** వాడటం వలన ఏకాగ్రత లోపం ఉన్న వ్యక్తులలో 80 శాతం వరకు నివారణ కనిపించింది. ఈ మందులు వాడటం వలన మెదడులో **Dopamine** ఉత్పత్తి అయింది. మానసికవైద్యుల ద్వారా శిక్షణ ఇవ్వడం ద్వారా 50 శాతం రోగులలో నివారణ కనిపించిది. మందులను మానసిక శిక్షణను సరయిన పాళ్ళలో కలిపితే చాలా వరకు ఉపయోగముంటుంది.

కానీ అహం కేంద్రత్వం ఉన్న వ్యక్తులకు దురదృష్టవశాత్తు నివారణ లేదు. వీళ్ళకు కొంతవరకు క్రమబద్ధమైన పరిసరాలను కల్పించడం వలన ఉపయోగముంటుంది. శారీరకమైన ఆధారమున్నట్టు కొంతవరకు నిర్ధారణ అయింది కాబట్టి దాని మీద జరిగే పరిశోధనలు త్వరలో దీనికి నివారణ కనిపెట్టెందుకు అవకాశముంది.

**Autism, Attention deficit disorder** ను కూడా ఎంత తొందరగా గుర్తించ గలిగితే అంత మంచిది మొదటి దశల్లో సరయిన మానసిక వైద్యుని సలహా తీసుకుంటే వాళ్ళు సాధారణ జీవితం గడిపేందుకు మనం కొంత సహకరించవచ్చు. వీళ్ళని నిర్లక్ష్యం చేస్తే వాళ్ళకు వాళ్ళే సమస్యలు కొని తెచ్చుకోవడం కాక సమాజానికి కూడా గుదిబండలుగా తయారవుతారు. అందువలన పిల్లల్లో శారీరక మానసిక ఎదుగుదలలను తల్లితండ్రులు చాలా జాగ్రత్తగా గమనించాలి ఇది తల్లిదండ్రుల అతిముఖ్యమైన బాధ్యత.

ఆధారం 1. "Clues to the cause of attention deficit disorder" published in The Hindu Dated 12 Feb 98 written by Michael Me Carthy from the Lanat

2. Autism written by Uta Frith published in Scientific American of June 93 Issue.

# Mind Your Alphabets

Alpha, beta, gamma - these three Greek alphabets seem to be chasing Soumen Sinha throughout his life. There are still many people who do not know the difference between an alphabet and letters of an alphabet. An alphabet consists of a set of letters with which a language is written. For instance, the Roman alphabet consists of 26 letters, from A to Z, with which English and a number of other languages are written. However, A and Z are not alphabets but merely letters of the Roman alphabet. Another misapprehension is that English is written in the "English script". It is not. It is written in the Roman script, whose medium is the Roman alphabet.

# నేటి సినీరంగపు తీరుతెన్నులు

- కె.ఎమ్.వి.జి. కృష్ణమూర్తి

ఒకప్పుడు తన సమీక్షలతో మనలను అలరించిన ప్రఖ్యాత సినీవిమర్శకురాలీనాడు ఫైవ్‌స్టార్ సదుపాయాలు కల్పించడంలోనూ, హోటలు గదుల్లో కాంప్లిమెంటరీ పళ్లబుట్టలు పంపడంలోనూ జరిగిన పక్షపాతాల గురించి సినీకబుర్లు రాసుకుంటోంది.

కింద సమావేశం జరుగుతోంది ఇంకా అంకితభావం కలవాళ్లు వస్తున్నారు పోతున్నారు. పెద్ద విషయాలపై తీవ్రంగా చర్చసాగుతోంది విదేశీఛానల్స్ నిషేధం, భారతీయ సంస్కృతి పరిరక్షణ మాట తప్ప, ముందే కూడబలుక్కున్నట్లుగా భారతీయ ఛానల్స్ అశ్లీలతల ప్రసక్తి రావడంలేదు.

టి.వి. బృందాలకు కొదవలేదు చిన్నా పెద్దా సినీ ప్రముఖుల ముఖాల్లోంచి వెలువడే సూక్తి ముత్యాలను ఏరుకుంటున్నారు. దేశవ్యాప్తంగా ప్రేక్షక మహాశయులకూ, వీళ్లకు ఉత్సవంముఖ్యం. ఉన్నవీ లేనివీ వివాదాలు, ఆడంబరాలూ, ప్రముఖుల ఆర్భాటాలూ కావాలి సినిమా లెవరికీ అక్కర్లేదు.

పత్రికల వాళ్లూ వచ్చారనుకోండి. వాళ్ల రోజువారీ నివేదికలకు బ్రోచర్లు ఆధారం. పోస్టు మోడర్నిజం మోడర్నిజంవంటి మాటలతో సందర్భ శుద్ధి లేని రిపోర్టులు ఇదివరలో వలె ఫీచర్ ఫిల్ము చిత్రాలనూ, డాక్యుమెంటరీలనూ కలిపి చూపించడం లేదు డాక్యుమెంటరీలను వేరేచోట చూపారు చిత్రాలను తయారు చేసిన వాళ్లూ, వాళ్ల స్నేహితులూ మరో పదిమంది పట్టువదలని విక్రమార్కులూ మాత్రం వాటిని చూసేలా జాగ్రత్త పడ్డారు. వివాదాస్పదమైతే కాని డాక్యుమెంటరీలు వార్తలకూ టి.వి. కవరేజికి కూడా నోచుకోవు

నిర్మాతలూ, నిర్దేశకులూ ఇండియన్ పనోరమాముందు తమ చిత్రాలను చూడమని ప్రాధేయ పడుతున్నారు. అదూరి గోపాలక్రిష్నన్ కాని శ్యాంబెనగల్ చిత్రమో లేకుంటే భారతీయ ప్రతినిధులు చూడరుకదా. ఆఖరికి ఒకళ్ల చిత్రాలను మరొకళ్లు చూసుకోవలసి వచ్చింది

నా చిత్రం రెండు ప్రదర్శనలకూ ప్రేక్షకులు అంతంతమాత్రమే. నిర్మాణంలో వైవిధ్యం ఉంది. చక్కటి ఛాయాగ్రహణం ఉంది. చెప్పుకుందుకో జాతీయ బహుమతి ఉంది. అయినా అల్లుడి నోట్లోశని తప్పలేదు

పది మాసాల తరవాత ఈ చిత్రోత్సవం ప్రసక్తి ఎందుకు? ('98 చలన చిత్రోత్సవానికి ముందే శ్రీ చటర్జీ ఈ రచన చేశారు - సంపాదకుడు) కారణం నేటి భారతీయ సినిమా స్థితిగతులు విషయమై అది రెండు ప్రధానాంశాలను ఎత్తి చూపింది. మొదటిది మెయిన్ స్ట్రీమ్ కమర్షియల్ చిత్రాలు, ఆర్ట్ సీరియస్ చిత్రాలు అనే వర్గీకరణ ఇంకా అవసరమా? రెండోది ఈ సినిమాలకూ వాటి ప్రేక్షకులకూ కలసంబంధం ఎటువంటిది?

ఆర్ట్ సినిమాను - పేరలల్ సినిమాగా కూడా పేర్కొవడం అలవాటు చారిత్రికంగా చూస్తే ఈ వర్గీకరణ తప్పు. స్వాతంత్ర్యం రాకపూర్వం మెయిన్‌స్ట్రీం ధోరణి నుండి అది క్రమాను గతంగా విడిపోయిందేకాని కాని దానంతగా అది ఏర్పడలేదు. దాని పునాది ప్రధానంగా భావజాలానికి

సంబంధించినది (idealogical). వాస్తవికత అనేది ఈ భావజాలానికి మీడియంగా నిలిచింది. 1950లలో సత్యజిత్‌రాయ్ ఈ ధోరణికి ఒకమైలురాయి. ఆ తరవాత ఈ రెండు వాహినులూ ప్రస్ఫుటంగా విడిపోయాయి. 1970ల నాటి 'మంచి సినిమా' - 'చెడ్డ సినీమా' అనేబదులు 'ఆర్ట్‌సినిమా' - 'కమర్షియల్ సినిమా' అనే వర్గీకరణ వ్యవహారం లోకి వచ్చింది.

ఇక్కడ రెండు సంగతులు చెప్పుకోవాలి. అంతర్జాతీయ చలన చిత్రోత్సవాలలో ఈ 'న్యూ సినిమా' కూ దాని నిర్దేశకులకూ వచ్చిన గుర్తింపు తో, ప్రత్యేకించి కొత్త నిర్దేశకులకు ఈ సినిమాల పట్ల ఆసక్తికలిగింది. ఈ 'న్యూ సినిమా' ధోరణి మనదేశంలో మాత్రమే ప్రత్యేకించి జరగలేదు. పోస్టు - కలోయినలిజకాలంలో యూరపు, లాటిన్ అమెరికా మరికొన్ని ఆఫ్రికా దేశాలలో కూడా వచ్చిన 'న్యూ సినిమా' ధోరణిలో ఇది కూడా ఒక భాగమే.

రెండో సంగతి: 'న్యూ సినిమా' అనేది ఏదో అల్పసంఖ్యాకుల సినిమాకాదు సత్యజిత్‌రే, మృణాల్ సేన్, శ్యాంబెనగల్, బసు చటర్జీల సినిమాల కోసం ప్రేక్షకుల ఎదురు చూసేవారు అధిక సంఖ్యలో ఈ సినిమాలను చూసి ఆదరించారు కూడా. వీళ్లందరూ కళాత్మకత కోసం చూసిన వారు కాదు. మెయిన్ స్ట్రీం సినిమాలనూ చూసేవాళ్లే వీటినీ చూశారు ప్రేక్షకులకూ, చిత్రదర్శకులకూ, అభిరుచులు, అభిలాషలలో ఐక్యతకనిపించేది.

ప్రకృతిలో లాగే, ముందో వెనుకో, కళాజగత్తులో కూడా ప్రవాహాలు దారి మారతాయి. 1980 లలో భారతీయ సినిమా విషయంలో ఇదే జరిగింది పొలిటికల్ అండ్ ఐడియాలజికల్ వాతావరణం కూడా మారసాగింది. 1980ల ఆరంభంలో గల ప్రగతి శీలత తగ్గింది. 'న్యూరిచ్' గౌరవాన్ని సంతరించుకుంది. సోషలిజాన్ని నిరసించడం కూడా గౌరవ ప్రదంగా మారసాగింది. లిబరలైజేషన్, గ్లాస్ నాస్ట్, పెరిస్త్రోయికాలు వచ్చాయి. రాజకీయ ప్రతీకలూ మారాయి. 'న్యూ సినిమా' అవసరానికే ఎసరువచ్చింది.

'న్యూ సినిమా' వాహినిలో మేటకూడా ఏర్పడి వాహిని నీరసపడింది. సహజంగా రూపొందిన నూతన శిల్పధోరణులు పడికట్టు రాళ్లుగామారాయి. ఈ సినిమాల విస్తతులు, నానాటికీ కుచించుకు పోయి కొందరు కళాతాపసులకే పరిమితిమై పోవడం ప్రమాదకరమైన ధోరణి. సినిమా హాళ్లలో చిత్రాలు విడుదల కావలసింది పోయి చిత్రోత్సవాలలో ప్రదర్శించడమే ప్రధానమై పోయింది. రాయపేటలో ఓడొక్కు హాల్లో ఆడే బెనగల్ చిత్రాన్ని వేటాడి చూడవలసి వచ్చింది. ఆసినిమా ఆరు రోజులు మాత్రమే ఆడింది. ఒకప్పటి మహావాహినిగా వెలిగిన 'న్యూ సినిమా' కుళ్లు కాలవగా మారి పోయింది.

ఈ వాహిని ఈ నాడు 'మెయిన్ స్ట్రీం సినిమా' దిశగా మళ్లిపోతోంది. ఆశయమే ప్రధానంగా ఉండడం, చిన్నబడ్జెటులో పనిచేసే నిబద్ధత అలాగే ఉన్నా, కథాగమనంలోనూ, పెద్దనటులను పెట్టడంలోనూ, సగటు ప్రేక్షకులను ఆకట్టుకునేందుకు ప్రయత్నాలు కూడా ప్రస్ఫుటమౌతున్నాయి. ఇది సంతోషదాయకమా, లేక అస్తిత్వాన్ని కోల్పోయే ఈ పరిణామం విచారకరమా అనేది దృక్పథానికి సంబంధించిన విషయం.

1995లో జాతీయ బహుమతి పొందిన బెంగాలీ చిత్రం 'ఉనీషె ఏప్రిల్' (19 ఏప్రిల్) ఆ దర్శకుని ప్రథమ ప్రయత్నమే. కలకత్తాలో నెలరోజులు 'హౌస్‌ఫుల్' గా ప్రదర్శించబడింది.

సత్యజిత్‌రే చిత్రాల రోజులు తరవాత ఇలా జరగడం ఇదే ప్రథమం కావడం హర్షణీయమే. నాలుగు గోడల మధ్య - తల్లీ - కూతుళ్ళ మధ్య మంచి డ్రామా, మంచి స్క్రిప్టు, మంచినటన కల ఈ చిత్రం, అమెరికన్ టెలివిజన్‌లో కనిపించే మంచి రకం చిత్రాలకు అటూ ఇటూగా ఉండే స్థాయిని దాటి ఈ చిత్రంలో ఏమీలేదు ఆ ఏడు దేశంలో తయారైన చిత్రాల్లో ఇదే గొప్పది కావడమే విచారకరం

మెయిన్ స్ట్రీం సినిమాల్లోనూ మార్పులు వచ్చాయి ఇవి మరింత సమకాలీనతనూ, ఉన్నతిని సంతరించుకోసాగాయి. దేశవాస్తవికతను ఇవి ప్రతిబింబిస్తున్నాయా లేదా అనేది వేరే సంగతి దక్షిణ దేశ చిత్రాలతో సాంకేతిక విలువలు గణనీయంగా పెరగడం ఆరంభమై వ్యాప్తిచెందింది సినీనిర్దేశకులూ, నటులూ మరింత పరిణితి చెందారు. ప్రేక్షకులనాకట్టు కునే కిటికులు మరింతగా ఆకళించుకున్నారు.

ఇక్కడ మరో విషయం గమనార్హం. 1982 లో ఆసియా క్రీడలు, రంగుల టి.వి. రూపర్ట్ మర్డోజ్, స్టార్ టి.వి. వచ్చి సినీ ప్రేక్షకులను సమూలంగా, తిరుగు లేకుండా మార్చాయి.

టి వి. యుగంలో పెరిగిన యువత ఈనాడు చీకటి హాల్లో పెద్ద తెరమీద సినిమా చూసిన తమ తలితండ్రులు లాగ చూడటంలేదు. చిత్రాల్లో కూడా షార్ట్‌నెస్, నిర్వచనం (definition) కలర్, ధ్వని, దృష్టివ్యవధి, - చాలామారాయి. ముప్పైసెకండ్లలో అరవై సార్లుకదిలే ఎడ్వర్టైజింగ్ కమర్షియల్‌ను పాతతరం వారు ఊహించడమే కష్టం.

టి.వి. రాకతో పాశ్చాత్యదేశాల్లో నూ, ఆరంభంలో సినిమాకు పోవడం, చూడడం లోనూ మార్పువచ్చింది. కాని అక్కడ టి.వి. కంటే తక్కువ లేదా సమ వస్తువైవిధ్యతలుగల దృశ్యపటిమతో టి.వి. వచ్చింది. అక్కడ టి వి. సినిమాలతో సరితూగవలసి వచ్చింది. కాని ఈ నాడు మనదేశ పరిస్థితి అందుకు భిన్నంగా ఉంది. ఇంటింటా వెలుగులు విరిజిమ్మే టి.వి. బటన్ నొక్కగానే ఎన్నెన్నో దృశ్యాలు, సంగీతాలూ, తెలిసినవీ, తెలియనవీ మనముందు మిరుమిట్లుగొలుపుతూ కనపడుతున్నాయి కారుచౌకగా. అందుకే మనదేశంలో సినిమా టి.వి తో సరి తూగవలసి వచ్చింది.

నేటి ప్రేక్షకులకు సినిమాతో పని లేదని గుర్తించక తప్పదు. రోజంతా టి.వి. వెదజల్లే ముడిసరుకులో భాగంగా మాత్రమే సినిమాలు టి.వి. వాళ్లకు కావాలి. కాని ప్రేక్షకులకు మాత్రం ఈతొంభైనిమిషాల ఖండికలు అవసరంలేదు. ఇంద్రియాలనూ, బుద్ధినీ, తృప్తిపరచే అంతులేని కార్యక్రమాల్లో సినిమాలూ ఒక భాగం మాత్రమే. అంతకుమించి ప్రేక్షకుల కవసరంలేదు.

మానవ సంబంధాల విషయంలో Picket-tences' చెయ్యలేనిది, లోబడ్జెటు ఫిల్మ్ చెయ్యగలిగినది. ఏముందికనక? M.T.V. చెయ్యలేనిది, అవంతె గార్డె (Avante Garde) సినిమా దృశ్యమాధ్యమానికి ఒరగబెట్టేదేముంది? ముందేంజరుగుతుంది? ఇప్పటికే మెయిన్ స్ట్రీం సినిమా, టి.వి.తో ఉభయ తారకంగా సాంగత్యం నెరపుతోంది. మరింత బాగా బలంగా ప్రేక్షక సమూహాలను పెంచుకుంటున్నాయి. నడివయసు కొచ్చిన 'న్యూసినిమా' కూడా, రచనా వ్యాసంగం, చిత్రకళల లాగే వ్యక్తిగత ( అభిరుచుల మేరకు తృప్తి పరిచే) మాధ్యమంగా మనగలగ వచ్చు. అల్పవాహినిగా ప్రవహిస్తూ ఉండొచ్చు. అంతర్వాహినిగానే ఉంటూ కొందరి జ్ఞాన తృష్ణను

తీర్చవచ్చు. భూమిపైన ప్రవహించే మహావాహినులకంటే అంతర్వాహినులుగా ప్రవహించే జలాలే మరింత స్వచ్ఛంగానూ, తియ్యగానూ ఉంటాయనే సంగతి తెలిసినదే. అదే మంచిది.

(సెప్టెంబరు - అక్టోబరు '97 Indian Review of Books సంచిక స్వాతంత్ర్యస్వర్ణోత్సవాల ప్రత్యేక సంచికగా వెలువడింది. అందులో వివిధ సాంస్కృతిక, కళారంగాల్లో ప్రగతి, విషయ సమీక్షల వ్యాసాలు వెలువడ్డాయి. సినిమాల స్థితిగతులపై సినీ ప్రముఖుడు, జాతీయ అవార్డు సినిమా నిర్దేశకుడూ, ధృతిమాన్ చటర్జీ రాసిన వ్యాసం రచయిత, పత్రికల అనుమతితో, సౌజన్యంతో స్వేచ్ఛానుసరణ చేసిన వ్యాసం).

# Use Of Articles

It is interesting to note how the use of articles, "the ", "a" and "an" varies from author to author or from one period to another.

In his "Spice of life". P J O Taylor refers to a girl "who would agree to go to an hotel...". Similarly, it is not uncommon to come across sentences like. "It is an historic occasion"; "an humble person" is, of course, frequently encountered. In all these cases, however, pronunciations as indicated by modern dictionaries, the "h" is not silent in the words, "hotel", "history" and "humble" which should normally preclude the use of "an" instead of "a". It may be that in hold English these words were pronounced with "h" as silent. Or, is there a different explanation?

The article "the" also lends itself to varied kinds of use, often depending on how it sounds to the ear: if its absence does not "jar" the ear, it is dropped, never mind the rules. As a recent instance at hand, takes Francesca Pierotozzi's article. "The pitfalls of immigration" writes, "...unlike the Spanish and Portugese....." Omission of "the" before "Portugese" is, of course, not correct but it does not so much jar the ear because of the conjunction "and". This is borne out by the words, "...probing the pain, the wound..." in the next column, where in the absence of a conjunctive word, the use of "the" to precede both the nouns becomes unavoidable. It has also often been found that when several rivers or several mountains are mentioned, "the" precedes only the first one: this, of course, is wrong.

Some changes in English usage has taken place in other areas also — not always for the better. In our young days, we were required to "agree with" or "concur with" a person but to "agree to" or "concur in" his proposal; to "avail ourselves of an opportunity" and not just to "avail of an opportunity". The word "inasmuch" in "inasmuch as" was regarded as a single composite word like "nevertheless". The appears to be no longer the case



"Wouldn't it be the most painful experience,
if, in the last moments on the cross,
you knew that your life,
sufferings and tormentations were futile?"

Artist : **TOM. J. VATTAKUZHY,** *M.F.A.*
(Educated into graphics at Santiniketan.
Award winner of Fine Arts and Crafts Society
consequtivaly for two years.)
His pictures capture the nativity of Kerala

